CASIO

# వెయ్యండి తై అంటూ తాళం!
# చెయ్యండి ఝుమ్ అంటూ నృత్యం!

© 1991 CASIO

నృత్యం చెయ్యడం (జామింగ్) కేసియో కీబోర్డుతో ఎంతో తేలిక. ఎందుకంటే, సరిగ్గా స్టార్స్‌లాగ వాయిద్యాలను వాయించటానికి అవసరమైన లక్షణాలన్నీ వున్నాయి దీట్లో. 'గ్రూవ్' చెయ్యండి డిస్కని, పేడని నొక్కండి, మీకు మనసైన బాణీలలోని పాటల్ని పాడండి. వెయ్యండి 'తై' అంటూ తాళం, మీ వీధి 'రాక్'తో అదిరిపోయేలాగ, కేసియోతో మీరు స్టైయిల్‌లో డాన్స్ చేస్తున్నారన్నమాటే.

SOUND KIDS




• 32 మినీ కీస్ • 25 పి సి ఎమ్ ప్రీసెట్ టోన్స్ • 30 ర్యాప్ పేటర్న్స్ • అంతర్నిర్మితమైన 'స్క్రాచ్' డిస్క్ • వాయిస్ ఇఫెక్ట్ ఫంక్షన్ • అంతర్నిర్మితమైన 3 ఇఫెక్ట్ కీస్ • మినీ మైక్రోఫోన్ దీంతో వుంది.




• 32 మినీ కీస్ • 100 పి సి ఎమ్ ప్రీసెట్ టోన్స్ • 19 పి సి ఎమ్ ఆటో రిథమ్స్ • 13 'సూపర్ ఎకంపెనిమెంట్' బ్యాకింగ్ పేటర్న్స్ • అంతర్నిర్మిత ... • 5 ప్రీసెట్ డిమాన్‌స్ట్రేషన్ ట్యూన్స్ • డ్యూయల్ స్పీకర్ సిస్టమ్.




• 32 మినీ కీస్ • 8 పి సి ఎమ్ టోన్స్ • ఇమిడివైన ఆర్ ఓ ఎమ్ ప్యాక్ • మెలోడీ గైడ్ ఫంక్షన్ • 5 అంతర్నిర్మితమైన సౌండ్ ఇఫెక్ట్ ప్యాడ్స్ • అంతర్నిర్మితమైన 6 డిమాన్‌స్ట్రేషన్ ట్యూన్స్ • మినీ మైక్రోఫోన్ దీంతోనే వుంది • తీసుకెళ్లడానికి హేండిల్.

**CITY MUSIC CO., PTE LTD.**
Singapore Tel 3377058, 3377545

**ONFLO MUSIC CO., LTD.**
Hong Kong Tel 722 4195

**RAINBOW PHOTO FINISHERS PTE LTD.**
Nepal, Kathmandu Tel 221724

**GENERAL ENTERPRISES COMPANY**
U.A.E., Dubai Tel: 224131/2/3

**MAHMOOD SALEH ABBAR CO.**
Saudi Arabia, Jeddah Tel: (02)6473995

**ARABIAN CAR MARKETING CO.,LTD.**
Oman Tel: 793741

**CASIO COMPUTER CO., LTD.**
Tokyo, Japan

M-9111 RAPCI TL



# వనిత

దీపావళి విశేష సంచికగా

వెలువడిన

నవంబర్ '91 సంచికలో

- ☆ వివిధ రచయిత్రులపై పేరడీ
- ☆ కొత్త సీరియల్ - 'మాతృదేవోభవ' ప్రారంభం
- ☆ ప్రముఖ దంపతులు శీర్షికలో జలంధర - చంద్రమోహన్
- ☆ 7 కథలు
- ☆ ఆరోగ్య 'విజయా'లు
- ☆ బాల్యస్మృతులులో షావుకారు జానకి చెప్పిన విశేషాలు
- ☆ అంకెల జాతకాలు అనే సంఖ్యా శాస్త్రం
- ☆ జీవనయాత్రా స్పెషల్‌లో 'డేటింగ్'
- ☆ ప్రతి పేజీలో చిట్కాలు

ఇంకా మీరు మెచ్చే యితర శీర్షికలతో, ఎక్కువ పేజీలతో వెలువడింది!

విడి ప్రతి : రూ. 6/-

## వనిత

• వినోదానికి • విజ్ఞానానికి • వికాసానికి



ఇది ఒక డాల్టన్ ప్రచురణ





# పక్షుల వేటగాళ్ళు







"పాటలు పాడే పక్షి కళ్ళు నీలంగా ఎంత బాగున్నాయి" అంది పూజ పక్షి ఫొటో చూస్తూ. "రండి. వెళ్దాం. పక్షిని చూద్దాం." అంది పూజ

## పాటలు పాడే పక్షిని దొంగిలించారు

BSA SLR సైకిళ్ళ మీద బాలగూఢ చారులు పాటలుపాడే పక్షి పంజరం దగ్గరకు వెళ్ళారు. "ఒక్కసారి బెల్ కొట్టి చూద్దాం ఏమవుతుందో" అని రాల్ఫ్ BSA SLR బెల్ కొట్టడం మొదలుపెట్టాడు. పూర్వంలాగా ఫలితం కనిపించలేదు. పూజకి ఆశ్చర్యం వేసింది, అనుమానం



వచ్చింది "పాటలు పాడే పక్షి కళ్ళేమో ఆకు పచ్చగా వున్నాయి" అంది. నిజం అది పాటలు పాడే పక్షికాదు! పాటలు పాడే పక్షిని దొంగిలించారు!



# రహస్యం

## కొత్తమనిషి కనిపించాడు

ఇంతలో ఒక కొత్తమనిషి కనిపించి "ఏమయింది" అని అడిగాడు. చెప్తే విని "అయ్యోపాపం" అని వెళ్ళి పోయాడు. ఆ మర్నాడు బాల గూఢచారులు BSA SLR సైకిళ్ల మీద గ్రామ ప్రాంతానికి వెళ్ళారు. ఉన్నట్టుండి ఒక ఇంటి వెనకాలకి ఆ కొత్త మనిషి వెళ్ళడం బైనాక్యులర్స్‌లో విపుల్ చూశాడు. అతను ఆలాపిస్తున్న రాగం విన్నట్టువుందే? అయితే ఆ ప్రాంతానికి తను కొత్త అని అతను చెప్పాడే? పాటలు పాడే పక్షి తనకు తెలీదన్నాడే?

## ముందుకు సాగారు

అంతు పట్టాలనుకున్నారు. బాల గూఢ చారులు BSA SLR సైకిళ్ళ మీద అతను వెళ్ళినదారిలో వెళ్ళారు మెల్లిగా బ్రేకులు వేసి ఆగారు. కొంతసేపయాక అతను తలుపు తాళం వేసి వెళ్ళిపోయాడు. బాల గూఢచారులు ఇంటి కప్పుమీదకి చేరుకుని లోపలకి చూశారు. బాబోయ్! భయం వేసింది! అరుదైన పక్షులు పంజరాల్లో వున్నాయి. చంపి పక్షులలాగానే వుంచిన వాటిని ఎక్కడకి పంపాలో అడ్రస్‌లు రాసి కాళ్ళకి కట్టారు! ఇంతలో పాటలు పాడే పక్షి గొంతు వినిపించింది. ముద్దొచ్చే ఖరీదు కట్టలేని పాటలు పడే పక్షి. "రండి పని పూర్తి చేద్దాము..." BSA SLR బాల గూఢచారులు కొత్త మనిషిని ఎందుకు అనుమానించారు. అతనే దొంగ!

స్నేహితులారా ప్రస్తుతానికి ఇవిచాలు. మరెన్నో రహస్యాలు మీకోసం వున్నాయి. ఎప్పుడో ఒకప్పుడు చకచకా వస్తాయి. అంతవరకూ మీ BSA SLR సైకిళ్ళ మీద సరదాగా తిరగండి. కదలండి. సాహస యాత్ర ప్రారంభించండి.

ఇప్పుడు ప్రతి BSA SLR తో డిస్పెన్స్ సీకర్ మరియు బ్రేక్‌లైట్ లభిస్తాయి.



**BSA SLR**

*Get Set 'n' Go on an adventure*

# Ekco®

## మార్కర్

"24" వున్న ఒక ప్యాక్‌లో

ఇది సరికొత్తది! సుందరమైనది! ప్రకాశవంతమైన, చలింపజేసే రంగులు!

అనేక మిలియన్ల మార్కర్ సెట్లు యు.ఎస్.ఎ కు ఎగుమతి చేయబడ్డాయి.

'12' వున్న ప్యాక్‌లలో
కూడ లభ్యం

Ekco MARKERS
24 FINE LINE WATER COLOUR MARKERS



పిల్లలకు ప్రియమైన కానుక




భారతదేశంలో తయారు చేసే వారు మరియు ఎగుమతి చేసే వారిలో అగ్రగణ్యులు.

ప్రెసిషన్ రైటింగ్ పాయింట్స్ ప్రై. లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలేపార్లే (తూ.) బొంబాయి-400 057.

SureShot/3345/Tel




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' నంచాలకుడు : నాగిరెడ్డి

## మన జీవితంలో విజ్ఞానశాస్త్రం

"ఏ సమాజానికైనాసరే విజ్ఞానశాస్త్రం లేకుండా భవిష్యత్తులేదు. విజ్ఞానశాస్త్రం వున్నా, దానిని ఉన్నత ఆధ్యాత్మిక ప్రేరణ అదుపు చేయనంతకాలం మనిషికి మంచి భవిష్యత్తు సాధ్యం కాదు!"

దాదాపు ముప్ఫై సంవత్సరాల క్రితం, ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, సిలోన్ విశ్వవిద్యాలయం, సైన్సువిభాగంలో ఉపన్యసిస్తూ అలా అన్నారు. అది ఈనాటికీ ఎంతో నిజం!

కేవలం ఊహాగానాన్ని విజ్ఞానశాస్త్రం అంగీకరించదు. సైన్సు ప్రతిదానికీ రుజువు కోరుతుంది. ఏ విషయమైనాసరే సందేహానికి చోటు లేకుండా ప్రయోగాల ద్వారా రుజువు కావాలి. అప్పుడే సైన్సు దానిని అంగీకరిస్తుంది.

విజ్ఞానశాస్త్రం సాధించిన ప్రగతి, ప్రపంచవ్యాప్తంగా మానవ జీవితంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చింది. పరిశ్రమలు, వ్యవసాయం, ఆరోగ్యం, రక్షణ మొదలైన వివిధ రంగాలను సైన్సు గాఢంగా ప్రభావితం చేసింది. నిజానికి సైన్సు ప్రభావానికి లోనుకాని రంగం అంటూ లేదు.

ఇన్ని రంగాలలో ఇంతటి అభివృద్ధి సాధించినప్పటికీ, మనిషి ఎదుర్కొంటూన్న నైతిక, ఆధ్యాత్మిక సమస్యలను మాత్రం విజ్ఞానశాస్త్రం పరిష్కరించలేక పోతున్నది. మానవ సమాజం తన భవిష్యత్తును, చీకట్లో ఇంకా వెతుకుతూనే ఉన్నది. కాబట్టి విజ్ఞానశాస్త్రాన్ని సత్యాన్వేషణకు సాధనంగా ఉపయోగించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది!

సంపుటి 89 నవంబర్ '91 సంచిక 5

విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00



# మళ్ళీ స్వతంత్ర దేశాలయిన బాల్టిక్ రాష్ట్రాలు!

సెప్టెంబర్ 17వ తేదీన జరిగిన ఐక్య రాజ్యసమితి 46వ సర్వసభ్య సమావేశం, ఏడు దేశాలకు నూతన సభ్యత్వం అంగీకరించింది. వాటిలో సోవియట్ యూనియన్ నుంచి విడిపోయిన ఎస్టోనియా, లాట్వియా, లిథోనియా దేశాలు ముఖ్యమైనవి. ఐక్యరాజ్యసమితి అంగీకరించిన మిగతా నాలుగు దేశాలు— ఉత్తర కొరియా, దక్షిణ కొరియా, పసిఫిక్ ద్వీప దేశాలయిన మైక్రొనీషియా, మార్షల్ ద్వీపాలు.




సోవియట్ యూనియన్ నుంచి స్వతంత్రం పొందిన కొన్ని రోజుల లోగానే బాల్టిక్ దేశాలకు, ఐక్యరాజ్యసమితి సభ్యత్వం లభించింది. ఒకప్పుడు రష్యను సామ్రాజ్యంలో అంతర్భాగంగా కొనసాగిన బాల్టిక్ దేశాలకు 1917వ సం॥లో రష్యా విప్లవం ద్వారా జార్ అధికారం నుంచి స్వతంత్రం లభించింది. అయినా, రెండవ ప్రపంచ యుద్ధానంతరం 1939వ సం॥ సెప్టెంబర్‌లో సోవియట్ నేత జోసెఫ్ స్టాలిన్, జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లర్‌ల మధ్య కుదిరిన ఒక ఒప్పందం ప్రకారం, 1940వ సం॥లో ఆ మూడు దేశాలను సోవియట్ యూనియన్ కలుపుకున్నది. యాభై సంవత్సరాలు సోవియట్ అధికారంలో గడిపిన బాల్టిక్ రాష్ట్రాలు ఇప్పుడు స్వతంత్ర దేశాలయ్యాయి.

మొట్టమొదట లిథోనియా 1990వ సం॥ మార్చినెలలో స్వతంత్రం ప్రకటించుకున్నది. సోవియట్‌లో ఆగస్టు నెలలో జరిగిన తిరుగుబాటు కారణంగా ప్రెసిడెంట్ గోర్బచేవ్ దాదాపు 70 గంటలసేపు అధికారంలో లేదు. దానినే మంచి అదనుగా భావించి, మిగతా ఎస్టోనియా, లాట్వియా రాష్ట్రాలు కూడా తమను స్వతంత్ర దేశాలుగా ప్రకటించుకున్నాయి. గోర్బచేవ్, మాస్కోకు తిరిగి వచ్చి, మళ్ళీ అధికారం చేపట్టాక, బాల్టిక్ దేశాల స్వతంత్ర ప్రతిపత్తిని అంగీ




కరిస్తున్నట్టు ప్రకటించాడు. సోవియట్ పార్లమెంటు సెప్టెంబర్ 6 వ తేదీ సమావేశమై బాల్టిక్ దేశాలకు స్వతంత్రాన్ని అంగీకరించింది. యాభై ఒక్క సంవత్సరాల చరిత్ర వెనక్కు వెళ్ళింది!

ఆ తరవాత బాల్టిక్ రాష్ట్రాలు సభ్యత్వం కోసం ఐక్యరాజ్యసమితికి విన్నవించాయి. వాటి కోరికను, మొదట భద్రతాసమితీ, ఆ పిమ్మట సర్వసభ్యసభ అంగీకరించాయి. మూడు దేశాలకూ 1917 నుంచి 1940 వరకు నాటి 'లీగ్ ఆఫ్ నేషన్స్'లో క్రియాశీలకమైన సభ్యత్వం ఉండేది. ఐక్యరాజ్యసమితి అంగీకారం తెలిపాక, లాట్వేనియా అధ్యక్షుడు, అంటొలిగార్బనోవ్, ''ప్రపంచ మానవ జాతి, రెండవ ప్రపంచ యుద్ధంలో పోగొట్టుకున్న తమ కుటుంబ సభ్యుల్ని ఇవాళ మళ్ళీ కనుగొన్నది!'' అని తన హర్షాన్ని వెలిబుచ్చాడు.

ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు ఫెరెజ్ డి కుయ్యలర్ పతాకావిష్కరణోత్సవంలో ఉపన్యసిస్తూ, సభ్యత్వం విషయంలో ఐక్యరాజ్యసమితి మరొక ముఖ్యమైన నిర్ణయం తీసుకున్నట్టు వ్యాఖ్యానించాడు.

ఐక్యరాజ్యసమితి సమావేశానికి హాజరయిన మూడు బాల్టిక్ దేశాల అధ్యక్షులూ, సోవియట్ యూనియన్‌తో రాజకీయ ఆర్థిక సంబంధాలు కలిగి వుంటామనీ, వెంటనే తమ ప్రాంతాల నుంచి సోవియట్ సేనలను ఉపసంహరించుకోవాలనీ కోరారు. సోవియట్ యూనియన్‌తో తాము మంచి పొరుగు దేశాలుగా కొనసాగాలని ఆశిస్తున్నట్టు వాళ్ళు అభిప్రాయం వెలిబుచ్చారు.



# తండ్రి కోరిక

సీతాపురం అనే గ్రామంలో, సుబ్బయ్య శెట్టి అనే వ్యాపారి వుండేవాడు. ఆయన కొక పచారీ దుకాణం వుండేది. ఆ కొట్టు మీద భుక్తికి లోటు లేకుండా ఆదాయం వుండేదికాని, చాలామందివర్తకుల్లాఆయన వ్యాపారంలో బాగా డబ్బు సంపాయించ లేకపోయాడు.

సుబ్బయ్యశెట్టి కొడుకు బదరీనాథుడు కూడా, తండ్రి దుకాణంలోనే వ్యాపారం నేర్చుకోసాగాడు. సుబ్బయ్యశెట్టి తరచుగా కొడుకుతో, "నా జాతకం మంచిదికాదు! అందువల్లనే బాగా సంపాయించలేక పోయాను. నువ్వయినా బాగా సంపాదిస్తే, నాకు తృప్తిగా వుంటుంది," అంటూండే వాడు.

ఒకసారి సుబ్బయ్యశెట్టి ఇంటికి, పొరుగూరులో వుండే ఆయన బావమరిది పరంధామయ్యశెట్టి వచ్చాడు. మాటల సందర్భంలో ఆయన సుబ్బయ్యశెట్టి అభిప్రాయం తెలుసుకుని, "బావా! నీ వ్యాపారం రాణించకపోవడానికి కారణం, నీ జాతకంకాదు, వ్యాపారంలోని మెళకువలు తెలియకపోవడం. మా ఊరిలో నాకు, నారాయణశెట్టి అనే మిత్రుడున్నాడు. అతని దగ్గిర, నీ కొడుకును గుమాస్తాగా చేర్పిస్తాను. వ్యాపారంలోని మెళకువలు నేర్చుకుని పైకి రాగలడు," అన్నాడు.

సుబ్బయ్యశెట్టి ఇందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు. మరునాడే పరంధామయ్య శెట్టి, బదరీనాథుణ్ణి వెంటబెట్టుకుని తన మిత్రుడైన నారాయణశెట్టి వద్దకు తీసుకు పోయి, "వీడు నా మేనల్లుడు. నువ్వు, వీడికి వ్యాపారంలోని మెళకువలు నేర్పాలి. ఇకనుంచి వీడి బాధ్యత నీది!" అని చెప్పాడు.

ఎస్. శివనాగేశ్వరరావు



ఒక రోజున నారాయణశెట్టి కొట్టుకు, భూషయ్య అనేవాడు వచ్చి, మినుములు మంచిరకం చూపించమని అడిగాడు. బదరీనాథుడు మేలిరకం మినుములు చూపించాడు.

భూషయ్య మినుముల్ని కొంచెం సేపు పరిశీలించి, "ఇంతకంటే మంచిరకం లేవా?" అని అడిగాడు.

అందుకు బదరీనాథుడు, "ఇవి మేలు రకానివే! ఇంతకంటే మంచివి లేవు," అన్నాడు.

ఆ సమాధానం విని భూషయ్య వెళ్ళబోతూంటే, నారాయణశెట్టి ఆపి, బదరీనాథుడితో, "రాత్రి వేరే మూటలు వచ్చాయి. లోపలకుపోయి దక్షిణం మూల నున్నమూటలోని మినుములుపట్టుకురా!" అన్నాడు.

భూషయ్య, ఈసారి బదరీనాథుడు లోపలినుంచి తెచ్చిన మినుములు చూసి తృప్తిగా తలాడించి, "ఈ రకం బాగున్నాయి," అని ఆ మినుములు కొనుక్కుపోయాడు.

బదరీనాథుడు, నారాయణశెట్టితో, "అయ్యా, రెండు మూటల్లోని మినుములూ ఒకేరకం కదా?" అంటూ తన అనుమానం వెలిబుచ్చాడు.

దానికి నారాయణశెట్టి, "మనదగ్గిరకు వచ్చే ఖాతాదార్లలో కొందరికి, నాణ్యత సంగతి బొత్తిగా తెలియదు. కానీ మనమెక్కడ మోసంచేస్తామో అని, తెలిసినట్టు నటిస్తారు. అటువంటి వాళ్ళకు మన దగ్గిరున్న సరుకు ఒకేరకమైనా, రెండు రకాలుగాచూపిస్తేసంతృప్తిచెందుతారు," అన్నాడు.

మరొకసారి గిరీశం అనే ఖాతాదారుడు వచ్చాడు. అతనొచ్చేసరికి దుకాణం రద్దీగా వున్నది. గిరీశం, బదరీనాథుడికి తనకు కావలసిన సరుకుల జాబితా ఇస్తూ, "జాబితాలో వున్నవన్నీ త్వరగా ఇవ్వు. అవతల నాకుముఖ్యమైనపనులున్నాయి," అంటూ తొందర చేశాడు.



''మీకంటే ముందొచ్చిన వాళ్ళున్నారు. వాళ్ళకిచ్చేదాకా ఆగండి,'' అన్నాడు బదరీనాధుడు.

ఆ జవాబుకు గిరీశం కోపం తెచ్చుకుని వెళ్ళబోయాడు. అయితే, నారాయణశెట్టి అతణ్ణి పలకరించి, ''ఒక్క నిమిషం కూర్చోండి. ముందు మీ పనే చూస్తాను,'' అని, పక్కకు తిరిగి చూస్తూ, ''ఒరేయ్, ఎవరక్కడ! ముందు గిరీశంగారి సరుకుల సంగతి చూడండి. అలాగే వారికి చెంబులో మంచి చల్లని నీరు పట్టుకురండి. బాగా ఎండనపడి వచ్చినట్టున్నారు,'' అని కేక వేశాడు.

ఇది విని గిరీశం తృప్తిపడిపోయి కూర్చున్నాడు. నారాయణశెట్టి, గిరీశం కంటే ముందు వచ్చినవాళ్ళకు సరుకు లిచ్చిన తర్వాతనే, గిరీశం సరుకుల సంగతి చూశాడు. అయినా గిరీశం మాట్లాడలేదు. సరుకులు కట్టి ఇచ్చే వరకూ ఓపిగ్గా ఆగి, వాటిని తీసుకుని వెళ్ళిపోయాడు.

బదరీనాధుడు, నారాయణశెట్టిని, ''అయ్యా, గిరీశం ధోరణి నా కర్థం కాలేదు. నేనన్న మాటకు కోపగించుకుని వెళ్ళబోయినవాడు, మీరు చాలా ఆలస్యం చేసినా ఎందుకు కిమ్మనలేదు?'' అని అడిగాడు.

''బదరీనాధా! కొంతమంది ఖాతా దార్లు, తమకు ప్రాధాన్యత ఇవ్వాలని కోరుకుంటారు. అటువంటి వాళ్ళను మనం, నలుగురి ముందు బాగా మాట్లాడి మర్యాద చేస్తే సంతృప్తి చెందుతారు,'' అని చెప్పాడు నారాయణశెట్టి.

ఒకసారి చిదంబరం అనే అతను దుకాణానికి వచ్చి, తనకు కావలసిన సరుకులు తీసుకుని, డబ్బు వారం రోజుల్లో ఇస్తానని చెప్పాడు. బదరీనాధుడు వెంటనే ఖాతా పద్దుపుస్తకం తీసి, బాకీ డబ్బు నమోదు చేయబోయాడు.

ఇది చూసిన నారాయణశెట్టి, బదరీ నాధుడితో, ''చిదంబరంగారి వంటి పెద్ద



మనుషులు అప్పు తీసుకుంటే, మనం ఖాతాలో పద్దు రాయనవసరం లేదు. వారే జాగ్రత్తగా గుర్తుంచుకొని తెచ్చిస్తారు,'' అన్నాడు.

ఆ మాటకు చిదంబరం ఎంతో సంతోషించి వెళ్ళిపోయాడు. చిదంబరం వెళ్ళగానే నారాయణశెట్టి, బదరీనాధుడితో, ''పుస్తకంలో ఇప్పుడు చిదంబరం ఎంత సరుకు అప్పుగా తీసుకున్నాడో రాయి!'' అన్నాడు.

బదరీనాధుడు ఆశ్చర్యపోతూ, ''అయన వుండగా వద్దని, ఇప్పుడు రాయమనడంలో, మీ అంతర్యం నాకర్థం కాలేదు,'' అన్నాడు.

నారాయణశెట్టి చిన్నగా నవ్వి, ''మనం వ్యాపారంలో అందరినీ నమ్మినట్టు కనిపించాలేగాని, ఎవరినీ నమ్మకూడదు. చిదంబరం నిజాయితీపట్ల, మనం నమ్మకం కనబరిస్తే, అతనూ నీతిగా బాకీ చెల్లించడానికి కట్టుబడతాడు. ఒకవేళ, అతను మనం మరిచిపోయామని, భావించి వూరుకుంటే, అప్పుడుమనంపద్దుచూపించి అడగడానికి వీలుంటుంది!'' అన్నాడు.

ఒక సంవత్సరం గడిచిన తర్వాత నారాయణశెట్టి, బదరీనాధుడితో, ''నీకు వ్యాపారంలోని చాలా మెళకువలు నేర్పాను. ముఖ్యమైనది మరొకటి మిగిలింది. అది, బాకీవసూలు! ఆ కిటుకు కూడా తెలుసుకున్నావంటే, నీకిక తిరుగుండదు. మనకు సిరియాళుడనేవాడు వందవరహాలకు పైగా బాకీ వున్నాడు. వాడి దగ్గిర సొమ్ము వసూలు చేసుకురా,'' అని చెప్పాడు.

బదరీనాధుడు రెండు, మూడుసార్లు సిరియాళుణ్ణి కలిసి బాకీ సంగతి అడిగాడు. అయినా, వాడు ఇచ్చే ధోరణిలో లేడు. ఆ బాకీ ఇవ్వకపోగా, సిరియాళుడి సరుకు అప్పు కోసం దుకాణానికి వచ్చాడు. బదరీనాధుడు దీనికి కోపం తెచ్చుకుని, ''పాతబాకీ ఇచ్చేదాకా, మళ్ళీ అప్పు పెట్టడం కుదరదు,'' అన్నాడు.

అంతలో నారాయణశెట్టి కల్పించుకుని, ''సిరియాళా! అవసరమైన సరుకులు తీసుకు వెళ్ళు. వీలు చూసుకుని డబ్బు సర్దుబాటు చెయ్యి. నీ దగ్గిర డబ్బెక్కడికి పోతుంది. అన్నట్టు, మీ పెద్దమ్మాయికి పెళ్ళి సంబంధం కుదిరిందట గదా! ఈ బాకీ తీర్చివేస్తే, మళ్ళీ పెళ్ళికి అవసరం అయిన సరుకులు అప్పుగా తీసుకుపోవచ్చు,'' అన్నాడు.

నారాయణశెట్టి మాటలవలలోపడిన సిరియాళుడు, నాలుగు రోజుల్లో బాకీ పూర్తిగా జమకట్టాడు.

ఆ తర్వాత వారం రోజులు ఆగి, కూతురు పెళ్ళికి అవసరం అయిన సరుకులకోసం వచ్చిన సిరియాళుడితో, నారాయణశెట్టి, ''ఈ మధ్య వ్యాపారం బాగా సాగడం లేదు. నీకు అప్పివ్వనందుకు ఏమీ అనుకోకు. మరెక్కడైనా ప్రయత్నం చెయ్యి,'' అన్నాడు.

ఈసారి పెద్ద మొత్తంలో అప్పు చేసి, ఎగవేయాలన్న ఎత్తుగడలో వున్న సిరియాళుడు, నారాయణశెట్టి అసలు సంగతి గ్రహించాడని, మారుమాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

తనకేసి ఆశ్చర్యంగా చూస్తున్న బదరీనాధుడితో, నారాయణశెట్టి, ''నిజానికి సిరియాళుడు డబ్బు స్తోమతుకలవాడే. అయితే, అప్పులు చేసి ఎగవేసే మనస్తత్వం అతడిది. అలాంటి వాళ్ళకు కీలెరిగి వాతపెట్టాలి!'' అన్నాడు.

కొన్నాళ్ళు జరిగాక నారాయణశెట్టి, బదరీనాధుణ్ణి పక్కన కూర్చోబెట్టుకుని ఆప్యాయంగా, ''నాయనా! ఇప్పుడు నీకు తెలియని వ్యాపార రహస్యాలూ, మెళకువలూ లేవు. ఇంటికి వెళ్ళి, మీ నాన్నగారి వ్యాపారం నీ చేతికి తీసుకో,'' అని చెప్పాడు.

బదరీనాధుడు, నారాయణశెట్టికి వినయపూర్వకంగా నమస్కరించి, తన ఊరు చేరి, తండ్రి వ్యాపారం చేపట్టి, కొద్దికాలంలోనే వ్యాపారాన్ని అభివృద్ధి చేసి తండ్రి కోరిక తీర్చాడు.



# చెప్పి చేసిన మోసం

రాజీవుడనే అతడికి కచేరీలో కొత్తగా ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరిన మొదటి రోజున, అక్కడే పనిచేస్తున్న రాఘవ అనే అతను, రాజీవుడితో, "ఇదిగో చూడు! ఈ కచ్చేరీలో చాలా జాగ్రత్తగా వుండాలి. డబ్బులు కనబడితే చాలు అప్పులు అడుగుతారు. అప్పు మాత్రం త్వరగా తీర్చరు," అంటూ హెచ్చరించాడు.

ఆ తర్వాత వాళ్ళిద్దరిమధ్యా స్నేహం పెరిగింది. నెలాఖరుకు అందరికీ జీతాలు ఇచ్చారు. తనను ఎవరన్నా అప్పు అడిగితే కుదరదని చెబుదామని, రాజీవుడు గట్టిగా నిశ్చయించుకున్నాడు. అయితే, రోజులు గడిచినా ఎవరూ అతణ్ణి అప్పు అడగలేదు.

ఒకరోజు రాఘవ, రాజీవుడు బజారుకు సరుకులు కొనడానికి బయలుదేరారు. రాఘవ కావలసిన సరుకులన్నీ తీసుకుని, మొత్తం డబ్బు ఎంత ఇవ్వాలో చెప్పమన్నాడు కొట్టువాణ్ణి. కొట్టువాడు చెప్పిన మొత్తానికి, అతడి దగ్గిర యాభై రూపాయిలు తక్కువగా వున్నవి.

అప్పుడు రాఘవ, రాజీవుడితో, "తీసుకున్న సరుకులు. తిరిగి ఇచ్చేయడం ఎందుకు! ఒక యాభై రూపాయలు సర్దు. రేపు కచేరీకి రాగానే ఇస్తాను," అన్నాడు.

రాజీవుడు సరేనని ఇచ్చాడు. అయితే, ఎన్ని రోజులు గడిచినా రాఘవ తను తీసుకున్న డబ్బు తిరిగి ఇవ్వకపోయేసరికి, రాజీవుడు దాని సంగతి అడిగాడు.

వెంటనే రాఘవ, "అదేమిటి? నేను ముందే చెప్పానుగదా, ఈ కచేరీలో అప్పులు ఇస్తే అంత త్వరగా వసూలు అవవని. కొన్నాళ్ళు ఓపికపట్టు, నాదగ్గిరున్నప్పుడు ఇస్తాను," అన్నాడు.

—కె. వెంకటసుబ్బారావు



# అపూర్వుడి సాహసయాత్రలు

## 9

[అపూర్వుడనే విచిత్ర వ్యక్తి, సముద్రపు దొంగల పాలైన ఐదుగురు కుర్రవాళ్ళను, సమీరుడి ద్వారా రక్షించి, దొంగలను రాజుగారికి అప్పగించాడు. మరొక ముఠా దొంగలు నిధిని తెచ్చుకోవడానికి శిలాద్వీపానికి చేరి, అక్కడే తాగి మత్తులో పడిపోయారు. అపూర్వుడూ, సమీరుడూ, అతడి మిత్రులూ నిధితోసహా పడవలో బయలుదేరారు. —తరవాత]

కుర్రవాళ్ళు పడవలో తీరం కేసి రావడం, సముద్రతీరంలో చేరిన గ్రామప్రజలు చూశారు. పరమ దుర్మార్గులయిన, సముద్రపు దొంగలను ఉపాయంతో బంధించి, రాజుగారికి అప్పగించిన సమీరుడూ, అతడి మిత్రులూ, మళ్ళీ దేని కోసమో సముద్రంలోకి వెళ్ళారన్న వార్త అప్పటికే చుట్టుపక్కల గ్రామాలకు వ్యాపించింది.

పడవను దూరం నుంచి చూసిన గ్రామ ప్రజలు కొందరు, "సమీరుడూ, అతడి మిత్రులూ వస్తున్నారు!" అని ఉత్సాహంగా కేకలు వేస్తూ, ఆ విషయాన్ని అందరికీ తెలియజేయడానికి గ్రామంలోకి పరుగులు తీశారు.

సముద్రతీరానికి కొంతదూరంలో, ఒక అందమైన ఉద్యానవనం మధ్య చిన్న భవనం ఒకటి ఉన్నది. విశ్రాంతి తీసుకోవ



డానికి ఎప్పుడైనా అక్కడికి రావడం రాజుకు అలవాటు. ఇప్పుడు కూడా రాజు ఆ విశ్రాంతి భవనంలోనే విడిది చేశారు. కుర్రవాళ్ళు, తీరం చేరుతున్నారన్న వార్త రాజుకూ అందింది. ఆ కుర్రవాళ్ళ పట్ల, ముఖ్యంగా సమీరుడిపట్ల రాజుకు అమితమైన అభిమానం. అందువల్ల ఆయనకూ వాళ్ళను చూడాలనిపించింది. వెంటనే రాజు గుర్రం మీద సముద్ర తీరానికి బయలుదేరాడు. ఆయన వెంట అంగరక్షకులు వచ్చారు. రాజు సముద్ర తీరం చేరేలోగా, కుర్రవాళ్ళ తల్లి దండ్రులూ, బంధుమిత్రులూ, ఇతర గ్రామస్తులూ అక్కడ చేరారు. వాళ్ళందరూ రాజును చూడగానే గౌరవంతో నమస్కరించారు.

"కుర్రవాళ్ళు ఎక్కడికి వెళ్ళారో తెలుసా?" అని అడిగాడు రాజు గ్రామ పెద్దను.

"తెలియదు ప్రభూ. ఎక్కడికి వెళ్ళారో, ఎందుకు వెళ్ళారో, ఎవరికీ తెలియదు!" అన్నాడు గ్రామ పెద్ద వినయంగా.

సముద్రంలో పడవ అంచున కూర్చుని, ప్రయాణం చేస్తూన్న అపూర్వుడు, తీరంలో రాజూ, గ్రామ ప్రజలూ గుమిగూడిన విషయం గ్రహించి, సమీరుడితో "ఇక నేను వెళతాను. రాజు ఉత్తముడు. నువ్వు తీసుకు వెళుతున్న ఈ నిధిని పేద ప్రజల బాధలు పోగొట్టడానికి ఉపయోగించమని రాజుగారితో చెప్పు," అన్నాడు.

సమీరుడు, అపూర్వుడికి భక్తితో నమస్కరించాడు. అయినా, అతని మనసులో అపూర్వుడు అప్పుడే వదిలి వెళుతున్నాడే అని కొంత విచారం కలిగింది. ఆ సంగతి గ్రహించిన అపూర్వుడు, "మిత్రమా, ధైర్యంగా వెళ్ళు. అంతా మంచే జరుగుతుంది. నిధి దొరికిందన్న ఆనందంలో, శిలాద్వీపంలో స్పృహతప్పి పడిపోయిన దొంగలను గురించి మరిచిపోవద్దుసుమా! వాళ్ళను అలాగే వదిలేస్తే మరణించ

గలరు. వాళ్ళను కాపాడమని రాజుగారికి చెప్పు." అంటూ పడవపై నుంచి, పక్కనే ఈదుతూ వస్తున్న గండుమీనం మీదికి ఉరికాడు. వెంటనే ఆ గండుమీనం పడవ నుంచి దూరంగా, వెళ్ళసాగింది. సమీరుడు అటుకేసి తిరిగి చూశాడు. రెప్పపాటులో అది అమిత వేగంతో బాణంలా దూసుకు పోసాగింది!

పడవ, నది సముద్రంలో కలుస్తున్న ప్రాంతాన్ని చేరింది. అలలు తక్కువగా ఉండడంవల్ల, అక్కడి జలం ప్రశాంతంగా ఉన్నది. దృఢకాయులయిన గ్రామస్తులు కొందరు నీళ్ళలోకి దిగి, కుర్రవాళ్ళు పడవలో నుంచి, గట్టు చేరడానికి సాయపడ్డారు.

సమీరుడు రాజుకు నమస్కరించి, దొంగలు దాచిన నిధిని ఎలా తీసుకు వచ్చిందీ ఆయనకు క్లుప్తంగా చెప్పాడు. పడవ దగ్గరికి వెళ్ళి, పెట్టెలనిండా వున్న నగలనూ, విలువైన ఆభరణాలనూ చూసిన రాజు, ఆనందాశ్చర్యాలకు అవధులు లేవు. ఆ నిధిని పేదల బాధలు పోగొట్టడానికి, ఉపయోగించగలమని, సమీరుడికి ఆయన హామీ ఇచ్చాడు. అందుకు తగిన పథకాలు ఆలోచించమని, రాజు సమీరుణ్ణి కోరాడు.

"ప్రభూ, ఈ నిధిని తమ విశ్రాంతి భవనంలోనే దాచండి. అది అక్కడే సురక్షితంగా ఉంటుంది," అన్నాడు సమీరుడు.





విధించవలసి వుంటుంది. ఎందరెందరో అమాయకులను, హింసించి చంపి, ఎన్నో కుటుంబాలనుసర్వనాశనంచేసినఆపరమ కిరాతకులకు అది సరైన శిక్షే అవుతుంది. సరే, నీ ఇష్టానుసారం, వాళ్ళను మొదట ఇక్కడికి తీసుకువద్దాం. ఆ తరవాత న్యాయసమ్మతమైన శిక్ష వేద్దాం,'' అని రాజు, అంగరక్షకులవైపు తిరిగి, వాళ్ళల్లో ఒకడి ద్వారా రాజధానికి సందేశం పంపాడు.

ఆ తరవాత రాజాజ్ఞప్రకారం, నిధిని భటులు రాజుగారి విశ్రాంతి భవనంలోకి తరలించారు.

''అలాగే చేద్దాం,'' అన్నాడు రాజు తల పంకిస్తూ.

''మరొక ముఖ్య విషయం ప్రభూ,'' అన్నాడు సమీరుడు.

''ఏమిటి?'' అని అడిగాడు రాజు.

''శిలాద్వీపంలో చిక్కుకుపోయిన సముద్రపు దొంగలను అక్కడి నుంచి తీసుకురావాలి!'' అన్నాడు సమీరుడు.

''ఎందుకూ? వాళ్ళను అక్కడే వదిలేస్తే ఏం?'' అని అడిగాడు రాజు.

''చచ్చిపోతారు ప్రభూ!'' అన్నాడు సమీరుడు.

''వాళ్ళను అక్కడి నుంచి కాపాడి తీసుకువచ్చినా, వాళ్ళకు మరణశిక్షే

మధ్యాన్నానికి రాజధాని నుంచి యాభై మంది సైనికులతో, రెండు పెద్ద పడవలు నదీ సంగమం దగ్గరికి వచ్చి చేరాయి. సమీరుడూ, అతడి మిత్రులూ, సైనికులకు శిలాద్వీపానికి దారి చూపడానికి ముందుకు వచ్చారు. ఖాళీగా వున్న తాము వచ్చిన దొంగల పడవలో, సమీరుడూ, అతడి మిత్రులూ, సేనానాయకుడూ ఎక్కి కూర్చున్నారు. వాళ్ళ పడవముందూ, దాని వెనక సైనికులున్న రెండు పడవలూ శిలాద్వీపం కేసి బయలు దేరాయి.

వాళ్ళు శిలాద్వీపాన్ని సమీపిస్తూండగా, అప్పుడే తెల్లవారుతున్నది. పడవలను

ఎక్కడ ఆపి, లంగరు దించాలో సమీరుడు సూచించాడు. అక్కడికి కొన్ని గజాల దూరంలోనే పెద్ద పెద్ద బండలు ఉన్నాయి.

హఠాత్తుగా ఒక రాయి దూసుకువచ్చి, సమీరుడి దగ్గర నిలబడిన సేనానాయకుడి పక్కన పడింది! దాని నుంచి చప్పున పక్కకు తప్పుకున్న సేనానాయకుడు, "ఆ మూర్ఖులు మనల్ని ఎదిరించాలనుకుంటున్నారు!" అని, బండల కేసి తిరిగి, "మీరు ఎంత పోరాడినా, మా నుంచి తప్పించుకోలేరు. మీరు ఐదుగురే వున్నారు. మేము యాభై మంది సైనికులం వచ్చాం. మర్యాదగా లొంగిపొండి. నా మాట విని, లొంగిపోయారంటే, మీకు విధించే శిక్ష కూడా అంత కఠినంగా వుండదు. ఎదురు తిరిగారో, చావు తప్పదు!" అని గంభీర స్వరంతో గట్టిగా హెచ్చరించాడు.

అయినా, రాళ్ళు బాణాల్లా రివ్వు రివ్వున వచ్చి పడసాగాయి. రాను, రానూ వాటి ఉధృతం ఎక్కువయింది.

"ఊఁ....వదలండి!" అని ఆజ్ఞాపించాడు సేనానాయకుడు.

మరుక్షణమే, రాళ్ళు వస్తూన్న దిక్కు కేసి ఒక్కసారిగా యాభై బాణాలు దూసుకు పోయాయి!

అటుపైన రాళ్ళు పడడం ఆగిపోయింది. పడవలు, సులభంగా బండలను సమీపించాయి!





కాపలాగా వుంచి, మిగతా నలభైమందిని, ఐదుగురు చొప్పున ఎనిమిది జట్లుగా విడదీసి, వాళ్ళను ద్వీపాన్ని ఒక్కసారిగా చుట్టుముట్టి, గుహలన్నిటినీ వెదకమని ఆజ్ఞాపించాడు.

సమీరుడూ, అతడి మిత్రులూ పడవలో నిలబడి, జరుగుతూన్న దానిని అమితాసక్తితో చూడసాగారు.

''సమీరా!'' అన్న మధుర కంఠస్వరం విని సమీరుడు ఉలిక్కిపడి, ఆ పిలుపు వినిపించిన దిక్కుకేసి చూశాడు.

అపూర్వుడు ఒక బండమీద చిన్నగా నవ్వుతూ నిలబడి వున్నాడు.

''సముద్రపు దొంగలు, ద్వీపం తూరుపు దిక్కున ఉన్న సొరంగంలో దాక్కొని వున్నారు. కాలయాపన కాకుండా, ఆ సొరంగాన్ని వెతికించమని సేనానాయకుడితో చెప్పు,'' అన్నాడు అపూర్వుడు.

సమీరుడు అమితోత్సాహంతో, పడవలో నుంచి, కిందికి దూకి, క్షణంలో సేనానాయకుణ్ణి సమీపించాడు.

''నిన్ను పడవలోనే ఉండమన్నాను కదా ఎందుకిలా వచ్చావు?'' అన్నాడు సేనానాయకుడు అప్యాయంగా.

''నిజమే. అయినా, మీకొక ముఖ్యమైన విషయం చెప్పవలసి వచ్చింది. దొంగలు అయిదుగురూ, ద్వీపం తూరుపు దిక్కున

సేనానాయకుడు సమీరుడితో, ''ఆ దొంగల కంటబడకుండా నువ్వూ, నీ మిత్రులూ ఇక్కడే పడవలో కూర్చోండి. మేము ఆ దుర్మార్గులను పట్టి బంధిస్తాం!'' అంటూ కిందికి దిగాడు.

సేనానాయకుడు లొంగిపొమ్మని మళ్ళీ ఒకసారి దొంగలను గట్టిగా హెచ్చరించాడు. అయినా, అటువైపు నుంచి సమాధానం ఏదీ రాలేదు. సైనికులు ఎత్తయిన బండల పైకి ఎక్కి చూశారు. కాని, దొంగలజాడ లేదు.

''వాళ్ళు ఏ గుహలోనో దాక్కొని వుంటారు!'' అని సేనానాయకుడు, పదిమంది సైనికులను ద్వీపముఖంలో

వున్న సొరంగంలో దాక్కొని ఉన్నారు," అన్నాడు సమీరుడు.

"ఆ సంగతి నీకెలా తెలిసింది?" అని అడిగాడు సేనానాయకుడు.

"మొదట నిధిని ఎలా కనుగొన్నామో, దొంగల నుంచి ఎలా తప్పించుకున్నామో, అలాగే ఇప్పుడు ఇది కూడా తెలిసింది!" అన్నాడు సమీరుడు చిన్నగా నవ్వుతూ.

సమీరుడు నిజమే చెబుతున్నాడని గ్రహించాడు సేనానాయకుడు. వెంటనే అతడు పదిమంది సైనికులను సమీరుడు సూచించిన సొరంగం కేసి నడిపించాడు. సొరంగద్వారం సమీపించగానే, "మీరు దాక్కున్న స్థలం తెలిసిపోయింది. ఇప్పటయినా గుట్టుగా లొంగిపోతారా? లేక మాచేత చావాలనుకుంటున్నారా?" అని హెచ్చరించాడు సేనానాయకుడు మళ్ళీ.

"చావు మాకు కాదు; మీకు. ఎవరైనా సొరంగంలోకి అడుగు పెట్టారో, ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు, సొరంగంలోని దొంగలనాయకుడు.

మరుక్షణమే సొరంగంలో, ఆ చివరి నుంచి భయంకర కంఠస్వరం వినిపించింది: "ఈ సొరంగం భయంకరమైన త్రాచుపాములకు నిలయం. మీరిక్కడ ఇంకొక్క నిముషం ఆగారో భయంకరమైన చావు తప్పదు!"

త్రాచుపాములకన్నా భయంకరంగా ఉన్న ఆ కంఠస్వరం విని దొంగలు గడగడ వణికిపోయారు. త్రాచులకు నిలయమైన ఈ చీకటి సొరంగంలోకి మానవమాత్రుడెలా వచ్చాడు? ఇది గుహను ఆవహించిన భూతం హెచ్చరిక కాదు కదా! అని హడలిపోయారు వాళ్ళు.

"లొంగిపోదాం!" అన్నాడు దొంగల నాయకుడు.

దొంగలు ఒక్కొక్కరుగా, సొరంగం నుంచి, చేతులు పైకెత్తి మెల్లగా బయటకు రాసాగారు. తలలు వంచుకుని, నిలువెల్లా వణికిపోతూ సేనానాయకుడి ఎదట నిలబడిన దొంగల రెక్కలు విరిచికట్టారు సైనికులు. —(ఇంకావుంది)





# రాజలక్షణం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో, ప్రతిసారీ ప్రయత్నం విఫలమవుతున్నా, కార్యసిద్ధికోసం నువ్వు పడుతున్న శ్రమ మెచ్చదగిందే! అయితే కొందరు పరిస్థితుల కారణంగా, అయాచితంగా లభించే గొప్ప అవకాశాన్ని కూడా, తగినంత విచక్షణాజ్ఞానం లేక కోల్పోతూంటారు. నువ్వు తీరా కార్యం సిద్ధించే తరుణంలో, వాళ్ళ లాగే ప్రవర్తిస్తావేమో అన్న శంక కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా, ఒక కట్టెలు కొట్టేవాడి కుమార్తె కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



కొండాపురం అనే గ్రామ ప్రాంతాన గల అడవుల్లో, కట్టెలు కొట్టేవాడొకడు గుడిసె వేసుకుని నివసిస్తూండేవాడు. వాడికి ఒక్కగానొక్క కూతురు ఉష. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న ఆమె, ఎంతో ఓర్పుగా, నేర్పుగా ఇంటిని దిద్దుకుంటూ, తండ్రికి అన్నిటా సాయ పడుతూండేది. ఆమె అవ్వ దూరప్రాంతాన గల అడవిలో వున్నది, భర్త పోయాక ఆ ఇల్లు వదలలేక, ఒంటరిగా ఆ ఇంటనే వుంటున్నది.

ఒకనాడు భోజనం సమయంలో కట్టెలు కొట్టేవాడు, కూతురుతో, "అమ్మా, ఉషా! నువ్వు మీ అవ్వను చూసి చాలా కాలమైంది. ఒకసారి వెళ్ళి ఎలా వున్నదో చూసి రాకూడదా," అన్నాడు.

"నేను వెళితే, ఇక్కడ నీకు ఇబ్బంది కదా, నాన్నా!" అన్నది ఉష.

"ఏ ఇబ్బందీ లేదు. నేను చూసుకుంటాను. నువ్వు ఒక పది రోజులపాటు తన దగ్గరవుంటే, మీ అవ్వ చాలా సంతోషిస్తుంది. రేపే బయలుదేరు," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

ఉష మర్నాడు బయలుదేరడానికి సిద్ధం కాగానే, ఆమె పెంచుతున్న పక్షులన్నీ, పెద్ద కోలాహలంగా ఆమె వెంట బయలుదేరాయి. అయితే ఉష వాటి నన్నిటినీ దూరంగా తరిమివేసి, తను ఎంతో ప్రేమగా సాకే మైనాను మాత్రం వెంట రానిచ్చింది. కాని, ఆమె చీకటి పడుతూండగా అవ్వ ఇల్లు చేరేసరికి, ఆమె కన్నుగప్పి వెనకనే వడ్రంగిపిట్ట, మేదరపిట్ట రానేవచ్చాయి.

ఆ సమయంలో అవ్వ నిప్పుల మీద జొన్నరొట్టెలు కాలుస్తున్నది.

మైనా ముందుగా ఇంట్లోకి పోయి, మంచినీటికుండ మీద వాలి, "చుట్టాలం వచ్చాం! మరి నాలుగు రొట్టెలు ఎక్కువ కాల్చు, అవ్వా," అన్నది.

మాట్లాడే మైనాను చూడగానే, మనమరాలు వచ్చిన సంగతి గ్రహించి, అవ్వ

ఆనందంగా ఎదురు వెళ్ళి, "రావే మనమ రాలా, రా! ఇన్నాళ్ళకు నీకి ముసలవ్వ గుర్తుకొచ్చిందన్నమాట!" అంటూ ఇంట్లోకి తీసుకువచ్చింది.

"నేను ఇటు రావడం అంటే, నాన్నకు కొంత ఇబ్బందికదా, అవ్వా!" అన్నది ఉష.

"ఇంతకూ, మీ నాన్న ఎలా వున్నాడు? నీకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడా? లేకపోతే నన్ను చూడమన్నాడా?" అంటూ పెద్దగా నవ్వింది అవ్వ.

"ఇంకా నయం! ఈ అడవిలో నాకోసం ఏ కోతినో, కొండముచ్చునో చూసి కట్టబెట్టేలా వున్నావు," అన్నది ఉష చిన్నగా నవ్వుతూ.

ఆమె లోపల ముందుగదిలో వేసి వున్న, మూడు పాతకాలపు చెక్క మంచాలను చూసి, "అవ్వా! తాతయ్య కాలం నాటి, ఈ మంచాలను అటక మీది నుంచి ఎందుకు దించినట్టు?" అని ఆశ్చర్యంగా అడిగింది.

అవ్వ తలాడించి, "అదొక పెద్ద కథ. ముందు నువ్వు స్నానం చేస్తే, వేడివేడి జొన్నరొట్టెలు వడ్డిస్తాను," అన్నది.

ఉష స్నానం చేసి వచ్చి రొట్టెలు తింటూండగా, ఆ మంచాలకథ చెప్పింది అవ్వ:



ఆ దేశపు రాజైన రాజసింహుడి భార్య, ఒకే కాన్పులో ముగ్గురు మగపిల్లలను ప్రసవించి కన్నుమూసింది. ఆ ముగ్గురూ యుక్తవయస్కులయ్యారు. జయుడు, అజయుడు, విజయుడు వాళ్ళ పేర్లు. అయితే, విద్యాభ్యాసం పూర్తయిన ముగ్గురు రాకుమారులూ బాధ్యత లేకుండా తిని తిరుగుతున్నారు. అనారోగ్య కారణంగా రాజసింహుడు, రాజ్యభారం ఎవరో ఒక కొడుక్కు అప్పగించాలని చూస్తున్నాడు. అయితే, కొడుకుల్లో ఎవరికీ రాజ్యభారం వహించాలన్న ఆసక్తి లేదు.

ఈ సంగతి గ్రహించిన రాజసింహుడు, ఎవరు ముందుగా వివాహం చేసు



రాకుమారులు రోజూ ఉదయమే, నచ్చే అమ్మాయిని వెతికే నెపంతో బయలుదేరి, ఎండవేళకు ఈ అడవిలోకి వస్తారు. సాయంత్రం దాకా అవ్వ ఇంట్లో చదరంగం, నిద్రలతో కాలం వెళ్ళబుచ్చి, చీకటిపడి కోటకు వెళ్ళిపోతారు.

"వాళ్ళందరికీ వండి వడ్డించినందుకేనేమో, నువ్విలా చిక్కిపోయావు!" అన్నది ఉష, అవ్వ చేయిపట్టుకుని చూస్తూ.

"అదేం కాదు. తినడానికన్నీ వాళ్ళే తెస్తారు. రాజకుమారులు రావడం మొదలు పెట్టాక, నిజానికి నాకు పగలు వంట బాధ తప్పిందనుకో!" అన్నది అవ్వ పెద్దగా నవ్వుతూ.

"సరే, మిగతా సంగతులు రేపు వింటాను. ముందు నన్ను కాస్త నిద్ర పోనీ," అంటూ ఉష ఒక చెక్కమంచం మీద పడుకున్నది.

అయితే, ఆ మంచం మీద ఆమెకు క్షణం కూడా నిద్రపట్టలేదు. ఆ పాత కాలపు మంచం నిండా నల్లులున్నాయి. అవి రాత్రంతా ఆమెను కుడుతూ నిద్ర పోనివ్వలేదు.

ఉష తెల్లవారి లేస్తూనే. "అవ్వా, అసలు ఆ వస్తున్నది రాకుమారులా, రాతి మనుషులా ? ఈ నల్లుల చెక్కమంచాల

కుంటారో, వాళ్ళకు రాజ్యం దక్కుతుందని చెప్పాడు. పెళ్ళి మీది కోరికతో అయినా, కొడుకులు రాజ్యభారం వహిస్తారని ఆయన ఆశ. దీనితో రాకుమారులు తమకే పిల్లా నచ్చలేదంటూ, వివాహం వాయిదా వేస్తున్నారు. దాదాపు అన్ని రాజ్యాల రాకుమార్తెలనూ, వాళ్ళు నిరాకరించారు.

ఇది పని కాదని రాజసింహుడు, ఆ ముగ్గురితో, "మీకు నచ్చే అమ్మాయిని, మీరే పోయి వెతుక్కోండి. ఒక సంగతి మాత్రం గుర్తుంచుకోండి—ముందుగా పెళ్ళి చేసుకున్నవాడిదే రాజ్యం!" అని చెప్పేశాడు.

మీద, వాళ్ళకసలు నిద్ర ఎలా పడుతున్నది?" అని అవ్వ నడిగింది.

"వాళ్ళకు రాజ్యభారం కన్నా, ఈ నల్లులబాధే నయంగా వున్నదేమో!" అన్నది అవ్వ.

ఉషకు రాత్రి నిద్రపట్టలేదని విన్న మైనా, మంచాల్లో దాగివున్న నల్లులను చంపే బాధ్యత వడ్రంగిపిట్టకూ, మంచాల మీదికి మెత్తటి గడ్డి ఈనెలతో పరుపు నేసే పని మేదరపిట్టకూ అప్పగించింది. ఒకటి, రెండు గంటలు గడిచేలోపల, అవి తమ కప్పగించిన పనులు పూర్తి చేశాయి.

ఈలోపల ఉష, ఇల్లంతా సర్ది బూజులు దులిపి, తోటలో వున్న పూలు తెచ్చి గదిని అందంగా అలంకరించింది. కిటికీలకు తెరలు అమర్చింది. మిట్టమధ్యాహ్నం సమయంలో, మూడు గుర్రాల మీద రాకుమారులు వచ్చారు.

వాళ్ళు రావడం చూస్తూనే మైనా, "మగ పురుగులు—నువ్వు వెనకగదిలోకిపోయి వుండు," అంటూ ఉషను అక్కడినుంచి పంపేసింది.

రాకుమారులు ఇంట్లోకి వస్తూనే గదిని కలయచూసి, "ఈ పాతకాలపు ఇంటికి, ఇంత అందం తెచ్చిన వాళ్ళెవరు, అవ్వా?" అని ఆశ్చర్యంగా అడిగారు.

"నా మనమరాలు ఉష వచ్చింది. ఇదంతా దాని పనే!" అన్నది అవ్వ.

"ఈ ఇంటికి నమ్మశక్యంకాని అందచందాలు తెచ్చిన; నీ మనమరాలిని చూడ





వలసిందే!'' అన్నాడు జయుడు. అతడికి చక్కగా అలంకరించిన ఇళ్ళంటే చాలా సరదా.

''అంత తొందరపడకు, యువరాజా! మా ఉషను చూడాలంటే అదృష్టం వుండాలి,'' అన్నది కిటికీలో వున్న మైనా.

మైనా మాటలకు, రాజకుమారులు ముగ్గురూ చాలా ముచ్చటపడ్డారు. వాళ్ళు తెచ్చిన తినుబండారాలను అవ్వ, తీసుకుపోయి ఉషకు ఇచ్చింది. ఉష వాటిని రుచి చూసి, రాకుమారులకోసం రాగి సంకటి తయారుచేసి పంపింది.

ఏనాడూ రాగి సంకటి రుచి ఎరగని రాకుమారులు, ''ఆహాఁ, అద్భుతం! మా అంతఃపురంలో ఇంత గొప్ప వంటకం, ఈనాటి వరకూ ఎవరూ తయారుచేయ లేదు,'' అన్నారు.

''మా ఉష ఇంతకంటే రుచికరమైన వంటకాలు, మరెన్నో చేయగలదు!'' అన్నది మైనా.

''అలాగా! అయితే, మీ ఉషను స్వయంగా అభినందించవలసిందే!'' అన్నాడు విజయుడు. అతను భోజన ప్రియుడు.

''మా ఉషను చూడడానికి కాలం కలిసిరావాలి!'' అన్నది మైనా బింకంగా.

రాకుమారులు, ఆ సాయంత్రం కోటకు వెళ్ళి, మర్నాడు మధ్యాహ్నం వేళలో అవ్వ ఇంటికి వచ్చారు. ఆ సమయంలో ఉష తోటలో పువ్వులు కోస్తూ, ఏదో పాట పాడుకుంటున్నది.

ఆమె సహజ సౌందర్యానికీ, తీయని పాటకూ ముగ్ధులైన రాకుమారులు ముగ్గురూ, ''ఆహాఁ, ఎంత మధురమైన కంఠస్వరం!'' అంటూ సంతోషంగా చప్పట్లు చరిచారు.

ఉష వాళ్ళను చూసి, ఇంట్లోకి వెళ్ళిపోయింది. వాళ్ళు ముగ్గురూ, ఒకరికి తెలియకుండా ఒకరు అవ్వతో, ''మీ ఉషను నేను పెళ్ళిచేసుకుంటాను,'' అని రహస్యంగా చెప్పారు.

''మా ఉష ఏమంటుందో తెలుసుకుని, రేపు చెబుతాను,'' అని అవ్వ వాళ్ళకు సమాధానం చెప్పింది.

సంగతి విన్న ఉష ముందు నిర్ఘాంత పోయి, ఆ రాత్రంతా ఆలోచించి, ''అవ్వా, నేను ముగ్గురు రాకుమారులనూ ఒక ప్రశ్న అడుగుతాను. నేను కోరుకున్న జవాబు చెప్పిన వారినే వివాహమాడతాను,'' అన్నది.

మర్నాడు రాకుమారులు రాగానే, అవ్వ వాళ్ళకు ఉష అభిప్రాయం ఏమిటో చెప్పింది. ముందుగా జయుడు, ఉష వున్న గదిలోకి వెళ్ళాడు.



''ఒకవేళ, మీనాన్న మన పెళ్ళికి అంగీకరించకపోతే, మీరేం చేస్తారు?'' అని ఉష అతణ్ణి అడిగింది.

''అటువంటి అనుమానాలు పెట్టుకోకు, నన్ను నమ్ము. మా నాన్న వద్దన్నా, ఆయనను ఒప్పించగలననే ధైర్యం, నాకుంది!'' అన్నాడు జయుడు.

తర్వాత గదిలోకి వచ్చిన విజయుడిని, అదే ప్రశ్న అడిగింది ఉష.

''మా నాన్న వద్దన్న పక్షంలో, ఈ వివాహం జరగకపోవచ్చు,'' అన్నాడు విజయుడు.

అతను వెళ్ళాక వచ్చిన అజయుణ్ణి, అదే ప్రశ్న అడిగింది, ఉష.

''మా నాన్న వద్దన్నా, ఈ పెళ్ళి ఆగదు. నీకోసం రాజ్యాన్నీ, సింహాసనాన్నీ అన్నీ వదులుకుని వచ్చేస్తాను,'' అన్నాడు అజయుడు.

ఉష గది నుంచి బయటికి వచ్చి, జయుడి మెడలో మందారమాల వేసింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఉష తన భర్తను ఎన్నుకున్న తీరు విచిత్రంగా లేదా? రాకుమారులలో విజయుడు, ఉషకు ఇచ్చిన జవాబును బట్టి, అతడు తండ్రి మాట జవదాటని వాడనీ, ఆయనపట్ల భక్తి గౌరవాలు కలవాడనీ ఊహించవచ్చు. ఎవరిస్వార్థం వాళ్ళు చూసుకునే రాచకుటుంబాల్లో, అది

చాలా అరుదైన గొప్ప గుణం. ఉష అలాంటివాణ్ణి నిరాకరించింది. తండ్రి కాదంటే, ఆమెకోసం అన్నీ వదులుకుని వచ్చేస్తానన్నాడు, అజయుడు. ఏకన్యా అంతగా తన ప్రేమను ఆశించేవాణ్ణి నిరాకరించలేదు. అయినా, ఉష అతణ్ణి కాదని, జయుడితో. పెళ్ళికి అంగీకరించింది. ఇది అనాలోచితం, విచక్షణా రహితంగా కనిపించడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఉష ఒక మామూలు కట్టెలు కొట్టుకు బతికేవాడి కూతురు. ఆమెకు రాజాంతఃపురంలో సేవకుడుగా జీవించేవాడయినా తగిన భర్తే. అయితే, రాకుమారులంతటివాళ్ళు, తమకు తాముగా ఆమెను పెళ్ళాడతామంటూ పోటీలుపడి ముందుకు వచ్చారు. ఆ స్థితిలో తెలివితేటలు గల ఏ యువతి అయినా, తనను పెళ్ళాడేవాడు, రాజ్యభారం వహించడానికి, తగినశక్తీ, వివేకం కలవాడా కాదా, అని ఆలోచిస్తుంది. ఉష చేసిన పని అదే. విజయుడు, తండ్రి మాట కాదనలేనన్నాడు, అంటే—అతడికి సొంత వ్యక్తిత్వమంటూ లేదు. ఇక, అజయుడు రాజ్యమే వదిలేస్తానన్నాడు. దానినిబట్టి అతడికి రాజ్యం గురించిన బాధ్యతా, మమకారం లేనట్టు తెలుస్తున్నది. పోతే, జయుడు మాత్రం తండ్రికి నచ్చచెప్పగలననే ధీమాను వ్యక్తం చేశాడు. రాజైనవాడికి కావలసిన లక్షణం అదే! ఎదుటివారిని నొప్పించకుండా, ఒప్పించగలగడం. ఆ కారణం వల్లనే, ఉష, అతణ్ణి వరించింది. ఇందులో విచిత్రమంటూ ఏమీలేకపోగా, ఆమె ఎంతో వివేకాన్నీ, విచక్షణాశక్తినీ ప్రదర్శించింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మాచిరాజు కామేశ్వరరావు రచన]



# చందమామ
## అనుబంధం—37



మన దేవుళ్ళు.

## మహావీరుడు

పురాతనకాలం నుంచి, జైనమత సంప్రదాయం మన దేశంలో కొనసాగుతున్నది. జైనమత సిద్ధాంతాలకు అధిక ప్రాచుర్యాన్ని తీసుకువచ్చిన మహానుభావుడు వర్ధమాన మహావీరజినుడు.

వర్ధమానుడు క్రీ. పూ. 6 వ శతాబ్దంలో వైశాలీ రాజకుటుంబంలో జన్మించాడు. ముప్పైయవయేట, ప్రాపంచిక సుఖాలను త్యజించి, అంతకు పూర్వం ఇరవై ముగ్గురు తీర్థంకరులు బోధించిన ఆధ్యాత్మిక మార్గాన్ని అవలంబించాడు. జైనమత సిద్ధాంతాలకు మరింత ప్రాచుర్యం కలిగించి ఇరవైనాలుగవ తీర్థంకరుడయ్యాడు.

మానవజీవిత ధ్యేయం నిర్వాణం. ఆత్మనిగ్రహంతో, సంపూర్ణ అహింసను పాటించినట్టయితే జననమరణ బంధాలనుంచి విముక్తి కలిగించే నిర్వాణం సిద్ధిస్తుందని ఆయన బోధించాడు.

వర్ధమాన మహావీరుణ్ణి జైన ఆలయాలలో పూజిస్తారు. ధ్యాననిమగ్నుడైన భంగిమలో వున్న ఆయన శరీరాన్ని, బంగారువర్ణంతో రూపొందిస్తారు. ఆలయాలలో మిగతా తీర్థంకరులను కూడా దేవుళ్ళుగా భావించి పూజిస్తారు. పురాతన, ఆధునిక జైన ఆలయాలు మన దేశమంతటా ఉన్నాయి.

## వార్తలలో బాలలు:

# అతి పిన్నవయసు నవలా రచయిత్రి!




వచ్చే క్రిస్మస్ నాటికి, 'ది డైరీ ఆఫ్ ఎ సెవెంత్ గ్రేడర్' (ఏడవ తరగతి విద్యార్థి దినచర్య) అనే ఆంగ్ల నవల వెలువడనున్నది. రెండేళ్ళ క్రితం ఏడవ తరగతి చదువుతూన్న ఓ అమ్మాయి వేసవి సెలవులలో ఈ నవలను రాసింది! ఈ నవలను ఇప్పుడు ఒక ప్రచురణకర్త ప్రచురించడానికి అంగీకరించాడు. ఈ నవలను క్రిస్మస్‌కు విడుదల చేయాలన్న ప్రయత్నంలో ఉన్నారు.

ఆ నవల రాసిన పదమూడేళ్ళ నయన్‌తారా నూరానీ ప్రస్తుతం కరాచీలోని పి.ఇ.సి. హైస్కూల్లో తొమ్మిదవ తరగతి చదువుతున్నది. ఈనాటి పాకిస్తాన్ బాలబాలికల మధ్య ఆ అమ్మాయి ఒక సంచలనం సృష్టించింది. ఆమె ఎక్కడయినా కనిపిస్తేచాలు; ఆటోగ్రాఫ్ కోసం పిల్లలు ఎగబడతారు. ఇవాళ పాకిస్తాన్‌లో అతి పిన్నవయసు రచయిత్రి నయన్‌తారా నూరానీ. ఆమె పదకొండవ యేట రాసిన మొదటి నవలను, పన్నెండవయేట ప్రచురించారు. ఆ నవలా రచన అనుకోకుండా ఒక కథలా జరిగిపోయింది.

నూరానీ తల్లి ఉపాధ్యాయిని. పేరున్న రచయిత్రి కూడాను. ఆమెను కరాచీలోని ఒక ప్రముఖ ప్రచురణ సంస్థ, ఒక పిల్లల నవలను రాసి పెట్టమని కోరింది. అయితే, చాలిన సమయం లేకపోవడం వల్ల ఆమె నవలను రాసి ఇవ్వలేనన్నది. వారి సంభాషణలు విన్న నయన్‌తారా, ఇంట్లో ఎవరికీ చెప్పకుండా పట్టుదలతో, కాగితాలు ముందేసుకుని, తన మనసులోని కథను రాయడం ప్రారంభించింది. సగం నవల రాశాక దానిని ఆ ప్రచురణ సంస్థకు పంపింది. మరునాడే మిగతా సగం పూర్తిచేసి పంపమని వాళ్ళ నుంచి ఫోన్ వచ్చింది! అంతే, మరి కొన్ని రోజులలో 'ఏ డ్రీమ్ కమ్స్ ట్రూ' అనే తొలి నవల పూర్తయింది. సవతి తల్లి బాధల నుంచి తప్పించుకోవాలని ఇంటి నుంచి పారిపోయిన ఒక బాలిక, ఒక సర్కస్ కంపెనీలో చేరి, ఎన్నో సాహసాలు చేసి, ఆఖరికి సొంత తల్లిని చేరుకోవడమే ఆ నవల ఇతివృత్తం. ఒక్క నవల వెలువడడంతోనే, నయన్ తారా రచనారంగంలో ప్రసిద్ధురాలయిపోయింది!

గణితం, భౌతికశాస్త్రం ప్రధాన పాఠ్యాంశాలుగా చదువుతూన్న నయన, ఆమె తరగతిలో అందరికన్నా మంచి మార్కులతో ప్రథమస్థానంలో ఉంటున్నది. తీరిక సమయంలో రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నది. పదహారేళ్ళ అక్కయ్య ఆమెకు సలహాలిస్తుంది. పదేళ్ళ తమ్ముడు ప్రూఫులు దిద్దడంలో సాయపడతాడు. ఆమె రాసినవాటిని తండ్రి టైపుచేసి పెడతాడు. ఆయన పాత్రికేయుడు కావడం వల్ల, ఆమె రాసిన వాటికి మార్పులు చేర్పులు చేయడంలో ఆశ్చర్యం లేదు. అయినా, అలాంటి మార్పుల కారణంగా, తండ్రీ కూతుళ్ళ మధ్య తరచూ వాదవివాదాలు జరుగుతూ వుంటాయి!

# మీకు తెలుసా?

1. ప్రపంచంలోకెల్లా అత్యధికంగా అమ్మబడుతూన్న వార్తాపత్రిక ఏది?
2. ప్రాచీన రోమనులు గుడ్లగూబలను అపశకునంగా, వినాశకారిగా భావించేవాళ్ళు. మరి తేనె టీగలను గురించి ఏమనుకునేవాళ్ళో తెలుసా?
3. ఆంగ్లభాషలో అత్యంత ప్రాచుర్యం పొందిన పాట ఏదో తెలుసా?
4. కేరళలో జన్మించి, తక్షశిలలో విద్యనభ్యసించిన ప్రాచీన గణిత శాస్త్రజ్ఞుడెవరు? ఆయన ఏ విషయంలో ప్రఖ్యాతిగాంచారు?
5. మన త్రివర్ణజాతీయ పతాకంలోని రంగులను మేడమ్ భికైజీ కామా రూపొందించారు. అమెరికా పతాకాన్ని ఒక స్త్రీ రూపొందించారు. ఆమె పేరేమిటి?
6. సోవియట్‌కు సంబంధించిన ఏ వ్యక్తి గౌరవార్థం భారతదేశం మొట్టమొదట తపాలా బిళ్ళను వెలువరించింది?
7. ఇంగ్లాండుకు చెందిన విక్టోరియారాణి, రష్యాకు చెందిన పీటర్ ది గ్రేట్ ఇరువురూ ఒక విజ్ఞాన వేత్తను చూడడానికి వెళ్ళారు. ఆయన ఎవరు? ఆయన కనుగొన్న పరికరం ఏది?
8. అమెరికాకు చెందిన ఈస్టర్ క్లీవ్‌లాండ్‌కు ఒక ప్రత్యేకత ఉన్నది; అదేమిటో తెలుసా?
9. అమెరికా అధ్యక్షుడు ఒకరు పదవి ముగిసేంతవరకూ బ్రహ్మచారిగానే గడిపారు. ఆయన ఎవరు?
10. భూమిమీద రికార్డయిన అత్యంత గరిష్ఠ ఉష్ణోగ్రత ఎంత?
11. అతి తక్కువ ఉష్ణోగ్రత ఎంత?
12. ప్రపంచంలో ఏర్పడిన అత్యంత దారుణమైన ప్రకృతి వైపరీత్యం ఏది?

## సమాధానాలు

1. జపాను నుంచి వెలువడే "యోమియూరి షింబున్." …74లో ప్రారంభించారు.
2. అదృష్టంగా భావించేవాళ్ళు. వాటిని దేవతల దూతలుగా భావించేవాళ్ళు.
3. "హేపీ బర్త్‌డే టూ యు...." ఈ పుట్టినరోజు పాటను 1936 వ సం॥లో మిల్డ్రెడ్ పేటీ హిల్ రచించారు.
4. ఆర్యభటుడు. వృత్తపరిధికి, దాని వ్యాసానికి మధ్య ఉన్న నిష్పత్తిని కనుగొన్నారు.
5. ఫిలాడెల్ఫియాకు చెందిన బెట్సీ రోజ్. ఆమె స్త్రీల ఉడుపులు కుట్టేది.
6. మాక్సింగోర్కీ. 1968 వ సం॥లో తపాలాబిళ్ళ వెలువడింది.
7. ఆంటన్ లీయువెన్‌హోక్. మైక్రోస్కోపు.
8. అతని తండ్రి గ్రోవర్ క్లీవ్‌లాండ్, అధ్యక్షుడుగా ఉన్నప్పుడు 'వైట్‌హౌస్'లో జన్మించిన, ఏకైక సంతానం ఆయన.
9. జేమ్స్ బుఛానన్. ఆయన తరవాత అబ్రహాంలింకన్ వచ్చారు.
10. 57.8°C ఉత్తర ఆఫ్రికాలోని అజీజాలో 1922 వ సం॥ సెప్టెంబర్ 13 న రికార్డయింది.
11. —88.3°C. అంటార్కిటికాలోని వాస్ టోక్ షూక్‌లో 1960వ సం॥ ఆగస్టు 20న నమోదయింది.
12. 1931 వ సం॥లో చైనాలోని హుయాంగ్‌హో నది పొంగి, దాదాపు 37 లక్షల మందిని కొట్టుకు పోయింది.

# చందమామ కబుర్లు

## భారీ కుటుంబం!




ఒకే కుటుంబానికి చెందిన ఏడువందలమంది, అందరూ సజీవులుగా ఉండడం ఊహించగలరా? అయితే నిజంగానే ఉన్నారు. కేరళ రాష్ట్రం కాలికట్ సమీప, కుట్టిచిరాలో కోళాయివీడు అనే ఒక మహమ్మదీయ కుటుంబం, ఈ విషయంలో రికార్డు సృష్టించి, గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాయించింది. చెరియా అయిషాబీ ఈ కుటుంబంలో అందరికన్నా వృద్ధురాలు. ఆమె వయసు 90 సంవత్సరాలు. ఆమె కొడుకులూ, కూతుళ్ళూ మనవలూ, మునిమనవలూ కలిసి మొత్తం 680 మంది ఉన్నారు. కొన్నేళ్ళుగా వాళ్ళందరూ ఆగస్టు 15 వ తేదీన ఒక చోట కలుసుకుని హాయిగా గడుపుతారు. ఫోటోలకు దిగుతారు. ప్రజాస్వామ్య పద్ధతికి అనుగుణంగానే కుటుంబ పెద్దను ఎన్నుకుంటారు. 75 సంవత్సరాల వృద్ధుడైన అహమ్మద్ కోయా గత 33 సంవత్సరాల నుంచి కుటుంబ పెద్దగా ఉంటున్నారు.

## పదవ గ్రహం!

మన సౌరమండలంలో తొమ్మిది గ్రహాలతోపాటు మరొక పదవ గ్రహం కూడా ఉన్నట్టు మూడు నెలల క్రితం, బ్రిటిష్ శాస్త్రవేత్తలు కనుగొన్నారు. సౌరమండల సమీపంలో మన భూగోళానికి పదింతల పరిమాణంలో ఒక గ్రహం లాంటిది పరిభ్రమిస్తున్నదని తెలియజేశారు. అది తన మాతృ నక్షత్రాన్ని వలయాకారంలో తిరిగి వస్తున్నదట. మాతృ నక్షత్రం మూడు సెకండ్లకోసారి 1400 మెగావాట్స్ తరంగ వేగంలో రేడియో తరంగాలను వెలువరిస్తున్నదనీ, వాటిని శక్తివంతమైన రేడియో టెలిస్కోప్ ద్వారా వినవచ్చునని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ధనూరాశి నక్షత్ర మండల సమీపంలోని ఈ గ్రహానికి పి.ఎస్.ఆర్. 1829-10 అని పేరు పెట్టారు.





# వేలిమీద గోరు

రామాపురం అనే ఊళ్ళో శివయ్య, శాంతమ్మ అనే దంపతులుండేవారు. వారికి ఒక డాబా ఇల్లూ, పదెకరాల పొలం వుండేది. శంకరం అనేవాడు, వాళ్ళ ఏకైక సంతానం. వాడు పరమ అమాయకుడు; అతి మంచివాడు.

కొడుకు అమాయకత్వం చూసి, తల్లిదండ్రులు దిగులుపడేవారు. తమ తదనంతరం వాడు ఎలా బతుకుతాడో అని భయపడుతూండేవారు.

ఒకనాడు శివయ్య, శాంతమ్మ బాగా ఆలోచించి, చివరకు ఒక నిర్ణయాని కొచ్చారు. అదేమిటంటే—మంచి తెలివిగల పేద ఇంటి పిల్లను కోడలుగా తెచ్చుకోవడం! కొన్నాళ్ళ తర్వాత శంకరానికి యుక్తవయసు రాగానే, వాళ్ళు అనుకున్న విధంగా లలిత అనే ఒక పేద ఇంటి పిల్లతో శంకరానికి పెళ్ళి చేశారు.

లలిత మంచి తెలివితేటలూ, చాలా చురుకుదనం గల పిల్ల. భర్త అమాయకత్వం ఎరిగి, అత్తమామలు ఆశించినట్టు గుట్టుగా కాపురంచెయ్యసాగింది. ఇదిచూసి శివయ్య, శాంతమ్మలు పొంగిపోయారు.

అయితే, క్రమేపీ లలితలో మార్పు వచ్చింది. వృద్ధులైన అత్తమామలకు సేవ చెయ్యవలసి రావడం, వారి సలహాలూ ఆమెలో క్రమంగా అసంతృప్తికి కారణమయినై. అందువల్ల, ఎలాగైనా భర్తచేత వేరింటి కాపురం పెట్టించి, ఏ బాదరబందీ లేకుండా సుఖంగా వుండాలనుకున్నది. అందుకని అనుకున్న కార్యం సాధించడానికి, ఆమె పథకాలు ఆలోచించసాగింది.

కొన్నాళ్ళ తర్వాత లలితకు ఒక ఉపాయం తోచింది. భర్త ఒట్టి అమాయకుడు గనక, తాను ఏం చేసినా, ఏం చెప్పినా ఇట్టే నమ్మి తల ఊపుతాడని, ఆమె ధైర్యం!

రావినూతల సువర్ణాకన్నన్



ఒకనాటి సాయంకాలం శివాలయంలో పురాణకాలక్షేపం జరుగుతూంటే విన డానికి వెళ్ళింది శాంతమ్మ. శివయ్య, శంకరం పొలాన్నుంచి ఇంకా రాలేదు. లలిత భర్త కోసం ఎదురుచూస్తూ, దూరంలో అతడు రావడం కంటబడగానే, కుడిచేతి బొటనవేలికి తడిగుడ్డ చుట్టుకుని మూలుగుతూ మంచంమీద పడుకున్నది.

శంకరం ఇంట్లోకి వస్తూనే, ఆమె దగ్గిరకు వెళ్ళి, "ఏం జరిగింది, లలితా?" అంటూ కంగారుగా అడిగాడు.

"పెద్ద ప్రమాదమే జరిగిందండీ! వేలు మీద గోరు మొలిచింది," అంటూ మరింత పెద్దగా మూలిగింది, లలిత.

"వేలు మీద గోరా!" అని శంకరం హడలిపోయి, "ఉండుండు, ఇప్పుడే గోపాలాచార్యులుగార్ని పిలుచుకొస్తాను," అంటూ బయటికి వెళ్ళబోయాడు.

లలిత, అతణ్ణి ఆగమని, "ఈ జబ్బు గోపాలాచార్యుల్లాంటి వైద్యులు నలుగురు కలిసికట్టుగా వచ్చినా కుదర్చలేరండీ! మా అవ్వ, ముత్తవ్వ చెప్పగా విన్నాను. ఈ వ్యాధికి వేరింటి కాపురం ఒక్కటే మందు. అలా కానప్పుడు ప్రాణాలకే ముప్పు," అన్నది.

శంకరానికి సంగతేమిటో అర్థం కాక దిక్కులు చూస్తూండగా, పొలం వెళ్ళిన శివయ్యా, శివాలయం నుంచి శాంతమ్మా వచ్చారు. శంకరం వాళ్ళకు జరిగింది చెప్పాడు. కొడుకు చేత వేరింటి కాపురం పెట్టించేందుకు కోడలు దొంగనాటకం ఆడుతున్నదని, వాళ్ళిద్దరూ గ్రహించారు.

కోడలికి, ఎలాగైనా గట్టిగా బుద్ధి చెప్పాలన్న ఆలోచనతో, శాంతమ్మ, "వేలి మీద గోరే! ఇది చాలా ప్రమాదమైన జబ్బురా, శంకరం," అన్నది పెద్దగా.

గదిలోంచి వాళ్ళ మాటలు వింటున్న లలిత, భర్తతోపాటు అత్తమామలు కూడా వెర్రిబాగులవాళ్ళని మురిసిపోసాగింది.

ఈలోగా శాంతమ్మ, భర్తకేదో చెప్పి పంపి, కోడలి దగ్గిరకొచ్చి కూర్చుని, వేలి

మీద గోరు మొలిస్తే ఎంత ప్రమాదమో తనకు బాగా అనుభవం అనీ, రేపీపాటి కల్లా కోడలిచేత వేరింటి కాపురం పెట్టిస్తా ననీ చెప్పింది.

ఇంతలో, గ్రామంలో నాటువైద్యం చేసే వీరన్నను వెంటబెట్టుకుని శివయ్య వచ్చాడు. వీరన్న చేతిలో పదునైన చిన్న కత్తి వున్నది. శాంతమ్మ గదిలోంచి బయిటికి వచ్చి, కొడుకుకు రహస్యంగా ఏదో చెప్పింది. అమాయకుడైన శంకరం తలాడిస్తూ భార్య దగ్గిరకు పోయి, ఆమెను మంచం మీది నుంచి లేవదీసి కూర్చో బెట్టి, గట్టిగా కదలకుండా పట్టుకున్నాడు. లలితఏదో చెబుతున్నా పట్టించుకోకుండా, శాంతమ్మ ఆమె రెండు చేతులూ వడిసి పట్టింది.

వీరన్న గదిలోకి వచ్చి, అరచేతిలో వున్న చిన్నరాయిమీద కత్తిని నూరుతూ, ''అమ్మాయిగారూ, తొందరగా చెయ్యి ఇటివ్వండి. త్వరగా వేలుకోసేసి, నేవెళ్ళి పోవాలి. అవతల ఇలాంటి వేలిమీద గోళ్ళే మరి నలుగురికి మొలిచాయి,'' అన్నాడు.

లలిత నోట మాటరాక నిలువునా వణికి పోసాగింది. శాంతమ్మ ఇదేమీ గమనించ నట్టు, వీరన్నతో, ''జాగ్రత్త, వీరన్నా! వేలు వరకే మెలుకువగా కోసెయ్యి,'' అన్నది.



దానికి వీరన్న పెద్దగా నవ్వుతూ, ''భలే వారండీ, అమ్మగారూ! మీరంతగాచెప్పాలా. వేలుకుబదులు చెయ్యే కోసేస్తానని, మీ భయమా? ఏదో. ఒకసారి ఒక వేలికి బదులు, రెండు వేళ్ళు కోశాను, అంతే!'' అంటూ లలిత చేతిని పట్టుకోబోయాడు.

అప్పటికి కాస్త తెప్పరిల్లిన లలిత, ఈ మతిమాలినవాడు నిజంగానే తన వేలు కోస్తాడనుకుని, అత్తగారికి దణ్ణం పెడుతూ, ''నా వేలికేం కాలేదత్తయ్యా! వేరింటి కాపురం పెట్టించాలన్న ఉద్దేశ్యంతో, ఈ చిన్న తమాషా చేశాను. వీరన్నను పొమ్మని చెప్పండి,'' అన్నది కళ్ళనీళ్ళతో.

శాంతమ్మ చిన్నగా నవ్వుతూ, కోడల్ని వదిలేసింది. వీరన్న కత్తిని రొండిన దోపుకున్నాడు.

శంకరం వాళ్ళకేసి గుబులుగా చూస్తూ, "మరి వేలి మీద మొలిచిన గోరు మాటే మిటి?" అన్నాడు.

"వేలి మీద గోరు పుట్టినప్పటి నుంచీ వుంటుంది," అన్నాడు వీరన్న పెద్దగా నవ్వుతూ.

లలిత తల సిగ్గుతో వాలిపోయింది.

శాంతమ్మ, లలితను బుజ్జగిస్తూ, "అమ్మాయ్, నీకు నిజంగానే వేరింటి కాపురం పెట్టాలనుంటే, నాకూ మీ మామ గారికీ, ఎలాంటి అభ్యంతరం లేదు. అయితే, మీరు మరొక చోటుకు వెళ్ళ నక్కరలేదు, ఈ ఇంట్లోనే వుండండి. మీ మామగారూ, నేనూ మన పొలంలో, ఒక పాక వేసుకుని వెళ్ళిపోతాం," అన్నది.

ఆ మరుక్షణం లలిత, అత్తగారి పాదాల మీద పడి, "ఇక బతికుండగా వేరింటికాపరం మాట ఎత్తను, అత్తయ్యా! జరిగిందానికి నేనెంతో సిగ్గుపడుతున్నాను. మీరు క్షమించానంటేగాని లేవను," అన్నది.

శాంతమ్మ, కోడలిని లేవదీసి, "క్షమిస్తాను. కానీ ఇప్పుడుకాదు! తొందరగా మాకొక మనవణ్ణో, మనవరాలినో ఇవ్వు. అప్పుడిక నీ జోలికి రాము," అన్నది.

లలిత సిగ్గుపడిపోతూ తల వంచుకున్నది. శివయ్య ఇచ్చిన రూపాయిబిళ్ళ తీసుకుని, దాన్ని గోటితో పైకి కొట్టి ఖంగు మనిపిస్తూ, వీరన్న, "లలితమ్మగారూ! రోజులు ఒకేలా వుండవు. ఈసారి మళ్ళీ వేలి మీద గోరు మొలిస్తే, నాకే కబురు పెట్టండి," అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఆ మాటలకు లలిత ముసిముసిగా నవ్వుకున్నది. ఆ తర్వాత ఆమె వేరింటి కాపరం మాట ఎత్తలేదు సరికదా, అత్తమామలను కన్నవాళ్ళలా చూసుకుంటూ, కాలక్రమాన ఇద్దరు బిడ్డల్ని కని, అత్తమామలు వాళ్ళ మురిపాలూ, ముచ్చట్లూ చూస్తూ, ఆనందించేలా చేసింది.





# స్నేహితుల కవిత్వం

ఒకానొక గ్రామంలో ముగ్గురు స్నేహితులుండేవారు. వారిలో వీర్రాజు అనే అతను నాస్తికుడు. అతను గుడికి వెళ్ళడు సరికదా, అలా వెళ్ళేవాళ్ళను వేళాకోళం చేసేవాడు. రామయ్య అనే అతను అన్నింటికీ దేవుణ్ణి నమ్ముకున్న ఆస్తికుడు. తననెవరైనా వేళాకోళం చేసినా, ఆ పాపం వాళ్ళనే కొడుతుందని సరిపెట్టుకుంటాడు తప్ప గొడవపెట్టుకోడు. సూరన్న అనే అతనికి బాగా డబ్బుంది కానీ పరమలోభి. పిల్లికి బిచ్చంపెట్టడు.

వీళ్ళు ముగ్గురూ స్నేహితులు కావడం ఒక విశేషం. ఇంతకన్న పెద్ద విశేషమేమిటంటే — మహాలౌక్యుడని పేరుబడ్డ చలపతి అనే అతనికి, ఈ ముగ్గురితో స్నేహం కలవడం!

మొత్తం నలుగురూ గ్రామం చివర మర్రిచెట్టుకింద ప్రతిరోజూ సాయంసమయంలో కలుసుకుని, సాహిత్య గోష్ఠి చేస్తూంటారు. ఈ నలుగురికీ కూడా అంతో యింతో కవిత్వం చెప్పడం వచ్చు. కానీ వాళ్ల కవిత్వం వినే నాధులే కరువయ్యారు. వాళ్ళ కవిత్వం వినడం పెద్ద శిక్ష అని అంతా చెప్పుకుంటారు. వాళ్ళు కవిత్వం నేర్చుకున్నందుకు రకరకాల కారణాలు గ్రామస్థులు హాస్యంగా చెప్పుకునేవారు.

వాటిలో కొన్ని: వీర్రాజు నాస్తికుడు కదా, అందుకని భూత ప్రేత పిశాచాలు వచ్చి బాధిస్తే అతన్ని ఏదేవుడూ రక్షించడు. మహామాంత్రికుడి శక్తికి బెదరని దయ్యాలు కూడా, వీర్రాజు కవిత్వం పేరు చెబితే, ఆమడదూరం పారిపోతాయట!

రామయ్య పరమ ఆస్తికుడు కదా, అతను తన కవిత్వాన్ని దేవుడికి వినిపిస్తాడు. ఇలాంటి కవిత్వం చెప్పే వాణ్ణి క్షణం విడిచిపెట్టినా ప్రజలు బ్రతకనివ్వరని,

"వసుంధర"

ఎల్లకాలమూ దేవుడు అతణ్ణి అంటిపెట్టుకుని వుంటాడట!

సూరన్న కవిత్వానికి భయపడి, మనుషులెవ్వరూ డబ్బు అవసరం అయినా సరే, అతడిదగ్గరకు వెళ్ళరు. రోజూ కవిత్వం పారాయణ చేస్తూంటే, అతని ఇంట్లోంచి దోమలు, ఈగలు ఎలుకలు కూడా పారిపోతాయుట!

ఇక చలపతి లౌక్యుడు కదా! వీళ్ళ వల్ల ఎప్పుడో ఒకప్పుడు ప్రయోజనం వుండకపోదని, వీళ్ళతో స్నేహం చేశాడు. అందువల్ల అతడికి వీళ్ళ కవిత్వం వినక తప్పలేదు. వీళ్ళమీద ప్రతీకారం తీర్చుకునేందుకు, అతను కూడా క్రమంగా కవిత్వం చెప్పడం అభ్యసించాడట!

ఏది ఏమైతేనేం, ప్రతిరోజూ వీళ్ళు నలుగురూ గ్రామంచివర మర్రిచెట్టుకింద చేరినప్పుడు, ఒకరి కవిత్వాన్ని ఒకరికి వినిపించుకుని, ఒకరినొకరు మెచ్చుకుంటూంటారు.

ఇలా వుండగా, అక్కడి భాగ్యవంతుడొకాయనకు గొప్ప కవిపోషకుడుగా పేరు తెచ్చుకోవాలనిపించి, కవుల మధ్య పోటీ పెట్టాడు. పోటీలో చుట్టుపక్కలనుంచి రెండువందలమంది కవులు వచ్చి పాల్గొన్నారు. భాగ్యవంతుడు, కవులు సమర్పించిన కావ్యాల్లోంచి అయిదు కావ్యాలను ఎన్నికచేసి, వాటిని రచించిన కవులకు ఒక్కొక్కరికి వెయ్యేసి వరహాల చొప్పున బహుమతి ఇచ్చాడు.



అలా బహుమతి పుచ్చుకున్నవారిలో చలపతి కూడా వున్నాడు.

పోటీలో పాల్గొన్న వీర్రాజు, రామయ్య, సూరన్నలకు ఏ బహుమతీ రాలేదు.

ఆ రోజునుంచీ వీర్రాజు, రామయ్య, సూరన్న ఒక్కటైపోయి, చలపతితో ముభావంగా వుండసాగారు.

లౌక్యుడైన చలపతికిది బాధగా అనిపించింది. వాళ్ళ ముగ్గుర్నీ తిరిగి తనవాళ్ళుగా చేసుకునేందుకు, అతడొక ఉపాయం ఆలోచించాడు. ఆ విధంగా, తన మిత్రుల లోని లోపాలు కూడా సవరించవచ్చునని అతనికి తోచింది.

ముందుగా చలపతి, వీర్రాజువద్దకు వెళ్ళి, "నువ్వు నాస్తికత్వం విడిచిపెట్టు, దేవుణ్ణి నమ్ము. ఆయన దీవెనలుంటేనే నీకు గుర్తింపు వస్తుంది," అన్నాడు.

తర్వాత రామయ్యను కలుసుకుని, "నువ్వు పోటీలు నిర్వహించిన భాగ్యవంతుణ్ణి కూడా, దేవుడిలా భావించి గౌరవించి వుంటే, నీ కావ్యానికి బహుమతి వచ్చి వుండేది," అన్నాడు.

ఆ తర్వాత సూరన్నతో, "లోభితనం నీకు తగదు. భాగ్యవంతుడు కావ్యాల మంచి చెడ్డలను నిర్ణయించమని, ఒకణ్ణి నియమించాడు. అతడికి కాస్త డబ్బిచ్చి వుంటే, నీ కావ్యానికి బహుమతి వచ్చి వుండేదేమో!" అన్నాడు.

ఇది జరిగాక, ఆ ముగ్గురూ ఎంతో సంతోషంగా వుండడం చలపతి గమనిం



చాడు. అయితే, వాళ్ళు తమ అలవాట్లను మాత్రం మానుకోవడంలేదని గ్రహించి, చలపతి ముగ్గుర్నీ విడివిడిగా మరొకసారి హెచ్చరించాడు. ఎందుకంటే, చలపతి లౌక్యుడు కాబట్టి అతడికి చాలా మంది స్నేహితులున్నారు. తన ముగ్గురు మిత్రులనూ, తనలాగే లౌక్యులుగా మార్చితే వాళ్లు సుఖపడతారని చలపతి తాపత్రయం.

అయితే వీర్రాజు, చలపతితో, "నీకు బహుమతి రావడానిక్కారణం, దేవుణ్ణి నమ్మడమని తెలిశాక నాకెంతో సంతోషంగా వుంది. మనుషుల మధ్య ఇన్ని తేడాలు సృష్టించిన ఆ భగవంతుడి సాయంతో కాక, నా స్వయంశక్తితో బహుమతి సాధిస్తాను. నీలాగా విలువలేని కావ్యానికి బహుమతి రావాలని తాపత్రయపడను. దేవుడు నాకెప్పుడూ శత్రువే!" అన్నాడు.

"నువ్వింకా గొప్ప కావ్యం రాశావనుకుని అసూయపడ్డాను. చచ్చు కావ్యానికి బహుమతి రావాలని, మనుషుల్ని దేవుడిగా భావించి కీర్తించలేను. గొప్ప కావ్యం రాసినప్పుడే నాకు బహుమతి వస్తుందిలే!" అన్నాడు రామయ్య.

"నీలాగా డబ్బిచ్చి బహుమతులు కొనుక్కునే నీచులుండబట్టే, చెత్త కావ్యాలకు బహుమతులొస్తున్నాయి. న్యాయంగా అయితే నా కావ్యానికే బహుమతి వచ్చేదని, నువ్వు చెప్పింది విన్నాక అర్థమయింది!" అన్నాడు సూరన్న నిరసనగా.

స్నేహభావంతో తానిచ్చిన సలహాలలోని మంచిని తీసుకోకుండా, ఎప్పుడూ ఎదుటివారిలో చెడునే చూసే వారితో అంతకాలం స్నేహం చేసినందుకు చలపతి సిగ్గుపడ్డాడు. తన కావ్యానికి బహుమతి వచ్చిందని దిగులుపడి, తన కావ్యాన్ని చిన్నబుచ్చి సంతోషపడేవాళ్ళతో ఇక స్నేహం తగదని చలపతి వాళ్ళకు దూరంగా వుండసాగాడు.

అయితే, వీర్రాజు, రామయ్య, సూరన్న మాత్రం యథాప్రకారం మర్రిచెట్టుకింద కలుసుకుంటూ సాహిత్యగోష్ఠి కొనసాగిస్తూనే వున్నారు.






సీత జాడ తెలిసిన తరవాత రాముడికి ఒక్క క్షణం కూడా అక్కడ ఉండ బుద్ధి పుట్టక, సీత ముందు వాలాలనిపించింది. ఆమె భయంకరమైన రాక్షస స్త్రీల మధ్య ఉన్నదంటేనే అతను భరించలేక పోయాడు. సీత హనుమంతుడితో ఏమేమి చెప్పిందో అది వింటూంటే, రాముడికి ఎంతో ఆనందం కలిగింది. అందుచేత అతను హనుమంతుణ్ణి, ''సీత ఇంకా ఏమి చెప్పింది?'' అని అడిగాడు. హనుమంతుడు రాముడికి కాకి కథ గురించి సీత చెప్పినదంతా వివరంగా చెప్పాడు.

''సీత ఈ వృత్తాంతం చెప్పి, 'అంత శక్తిగల రాముడు వచ్చి, ఈ రాక్షసుల మీద అస్త్రాలు ఎందుకు ప్రయోగించడు? రాముడికి నా మీద ఏ కొంచెం అనురాగం ఉన్నా, వెంటనే వచ్చి రావణుణ్ణి చంపమను. కనీసం నన్ను రక్షించటానికి రాముడు లక్ష్మణుణ్ణి అయినా పంపరాదా? దేవతలనైనా జయించగల ఆ ఇద్దరూ నన్నెందుకు ఇలా ఉపేక్షించి ఊరుకున్నారు? నేనేదో పాపం చేసుకుని ఉండాలి; అందుకే రామలక్ష్మణులు వచ్చి నన్ను చూడకుండా ఉన్నారు,' అన్నది. రామలక్ష్మణు లిద్దరూ ఆమె కోసం పుట్టెడు దుఃఖంలో ఉన్నారని నేను ఆమెకు చెప్పాను. ఇంక ఆమె కష్టాలు తీరిపోతాయనీ, ఆమె దుఃఖించనవసరం లేదనీ కూడా ఆమెతో అన్నాను. ఆమె బెదిరి అన్ని దిక్కులూ చూసి, తన

18. వానర సేనల ప్రయాణం



జడలో ఉన్న చూడామణి తీసి నా చేతికి ఇచ్చింది. మీ అందరి క్షేమమూ అడిగినట్టు చెప్పమన్నది. రామలక్ష్మణులూ, సుగ్రీవుడి బలాలూ వచ్చి, రావణుణ్ణి చంపేస్తారని ఆమెకు ధైర్యం చెప్పి, వచ్చాను,'' అన్నాడు హనుమంతుడు.

హనుమంతుడు చెప్పిన మాటలకు రాముడు పరమానందం చెంది, ''ఈ హనుమంతుడు చాలా గొప్ప పని చేశాడు. ఇలాంటి పని మరొకరికి సాధ్యం కాదు. సముద్రాన్ని దాటగలవాళ్ళు ఈ హనుమంతుడి తరవాత గరుత్మంతుడూ, వాయుదేవుడూ మాత్రమే ననుకుంటాను. లంకలో ప్రవేశించి ప్రాణాలతో బయట పడటం మాత్రం మాటలా? మొదట ప్రవేశించటమే మరొకడికి సాధ్యం కాదు! హనుమంతుడు సుగ్రీవుడి అజ్ఞలను మాత్రమే నిర్వర్తించక, స్వతంత్రించి, అశోకవనం ధ్వంసం చెయ్యటమూ, రాక్షసులను చంపటమూ, లంకను తగలబెట్టటమూ మొదలైన సాహసకార్యాలు కూడా చేశాడు. ఇలాచేసి అతను సుగ్రీవుడికి అధికమైన సంతోషం కలిగించాడు. ఇతను చేసిన పని మా రఘువంశానికంతటికీ మేలు కలిగించింది. కాకపోతే, ఈ హనుమంతుడికి తగిన సత్కారం చేయలేని స్థితిలో ఉన్నానే అని నేను బాధపడుతున్నాను. నా ప్రాణాలూ, సీత ప్రాణాలూ కాపాడిన హనుమంతుడి ఋణం ఏమిస్తే తీరుతుంది? ఒక్కసారి అతన్ని ఆలింగనం చేసుకుంటాను,'' అంటూ హనుమంతుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు.

తరవాత రాముడు కొంచెం ఆలోచించి, ''వానర సేనలు సముద్రాన్ని దాటి, అవతలి గట్టు చేరేది ఎలా? ఆ మాట తలుచుకుంటేనే నాకు భయంగా ఉన్నది. సీతాదేవికి ధైర్యం చెప్పినట్టు కాదు; సముద్రాన్ని దాటే ఉపాయమేమిటి?'' అంటూ హనుమంతుణ్ణి చూసి విచారంలో పడ్డాడు.

అప్పుడు సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు:

''ఎందుకు విచారిస్తావు? సీతాదేవి ఉన్నచోటూ, శత్రువు ఉన్నచోటూ తెలిసినమీదట మిగిలిన సమస్యలు ఏవీ శత్రువును చంపటానికి అడ్డం రావు. మనం సముద్రానికి సేతువు కట్టుదాం; రావణుణ్ణి చంపి, సీతాదేవిని తీసుకువద్దాం. సేతువు కట్టి, లంకానగరం మన కంటపడగానే రావణుడు చచ్చినవాడికింద జమ! ఇప్పుడు నీకు కలగదగినది విచారం కాదు, క్రోధం. సముద్రం ఎలా దాటాలన్నది మాతోబాటు నువ్వు కూడా ఆలోచించు. సేతువు కాకపోతే మరో మార్గంగానయినా సముద్రాన్ని దాటి తీరుతాం. రావణుడు చచ్చి తీరుతాడు. నీకు జయం కలిగి తీరుతుంది.''

రాముడు హనుమంతుడి కేసి తిరిగి, ''సముద్రాన్ని సేతువు కట్టిగాని, సముద్రాన్ని ఎండగట్టిగాని, తపస్సు చేసిగాని ఏదోవిధంగాదాటవచ్చుననుకుందాం.పోతే, లంకానగరానికి ఎన్ని దుర్గాలున్నాయి? సైన్యం ఏపాటి ఉన్నది? ద్వార రక్షణ ఏ విధమైనది? ప్రాకారాలూ మొదలైనవి ఎలా ఏర్పాటు అయిఉన్నాయి? ప్రత్యక్షంగా చూసి ఉన్నావు గనక, నాకు వివరించి చెప్పు!'' అని అడిగాడు.



హనుమంతుడు రాముడికి ఇలా చెప్పాడు:

''లంకా నగరం మహావిశాలమైనది. అక్కడ అసంఖ్యాకులైన రాక్షసులు సుఖసంతోషాలతో ఉన్నారు. ఎక్కడ చూసినా రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కనిపిస్తాయి. లంకలోకి శత్రువు ప్రవేశించటం అసాధ్యం. నగరానికి నాలుగు ద్వారాలున్నాయి; వాటికి పెద్దవీ, దృఢమైనవీ అయిన తలుపులు ఉన్నాయి. ద్వారాల వద్ద పెద్ద పెద్ద యంత్రాలు, బాణాలనూ, శిలలనూ ప్రయోగించేవి ఉన్నాయి; శత్రుసైన్యం అటుగా వస్తే ఆ యంత్రాలు దాన్ని నాశనం చెయ్యగలవు. ద్వారాల



వద్ద మహాశూరులైన రాక్షసులు ఉంటారు. వారి వద్ద ఉండే ఇనుప పరిఘలు ఒక్క దెబ్బన నూరుమందిని చంపగలవు. నగరం చుట్టూ బంగారపు ప్రాకారం ఉన్నది; దాని మీద అక్కడక్కడా రత్నాలు పొదిగి, అందంగా ఉన్న భాగాలున్నాయి. ఆ ప్రాకారాన్ని దాటటం సాధ్యంకాదు. ప్రాకారంచుట్టూ లోతయిన అగడ్త లున్నాయి; వాటిలో భయంకరమైన మొసళ్ళూ, చేపలూ ఉన్నాయి. ప్రతి ద్వారం వద్దా అగడ్తకు వంతెనలు ఉన్నాయి: వాటిని ఎత్తవచ్చు, దించవచ్చు: వాటిని అవసరాన్నిబట్టి ఎత్తటానికీ, దించటానికీ పెద్ద యంత్రాలున్నాయి.

రావణుడు చాలా జాగ్రత్త గలవాడు; యుద్ధం లేనప్పుడు కూడా తన సేనలను మంచి శిక్షణలో ఉంచుతాడు. అదీగాక, లంకానగరం త్రికూట పర్వతం మీద ఉన్నది. కిందినుంచి పైకి వెళ్ళేటందుకు మార్గం లేదు. లంకకు పోవటానికి ఓడ మార్గం లేదు. అందుచేత అక్కడి వార్తలు బయటి ప్రపంచానికి అందవు. లంకా నగర ద్వారాల వద్ద లక్షల సంఖ్యలో సాయుధులైన రాక్షసులు ఉంటారు. నగర మధ్యంలో లెక్కకు మించిన రాక్షససేన ఉన్నది. అయితే, నేను అగడ్తల మీది వంతెనలను పగలగొట్టాను; లంకా నగరం తగలబెట్టాను; కొందరు రాక్షస వీరులను చంపాను. అందుచేత లంకకు ఇప్పుడు అంత బలం లేదు. సముద్రాన్ని ఎలా దాటినా దాటవచ్చు. లంకను జయించటానికి మన అంగదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవంతుడూ, బనసుడూ, మన సేనానాయకుడైన నీలుడూ చాలు. వెంటనే మంచి ముహూర్తం నిశ్చయించి బయలుదేరవచ్చు.''

ఆ మాటలు విని, రాముడు సుగ్రీవుడితో, ''మనం ఇప్పుడే ప్రయాణమవుదాం. సూర్యుడు నడినెత్తిన ఉన్నాడు. ఈ అభిజిత్తు అనే ముహూర్తం చాలా మంచిది,'' అన్నాడు.

సేనల గమనం ఎలా ఉండవలసిందీ అతను వివరంగా చెప్పాడు. సేనానాయకు డైన నీలుడు తన బలగంతో ఫలసమృద్ధి గల మార్గాలగుండా సేనను నడిపించాలి. శత్రువులు ముందుగా ఆ ప్రదేశాలను ధ్వంసం చెయ్యకుండానూ, వాళ్ళు పల్లపు ప్రదేశాలలో మాటువేసి ఉండి అక స్మాత్తుగా మీదపడకుండానూ జాగ్రత్త పడాలి. సేనలు నడవబోయే మార్గాలను ఆకాశమార్గాన ముందుగా వెళ్ళి, తెలుసు కోవాలి. తక్కువ పరాక్రమవంతులు దిగబడిపోయి, మంచియోధులు మాత్రమే బయలుదేరాలి.



రాముడి వెంట వానరసేన బయలు దేరింది. మహాకాయుడైన గజుడూ మహా బలులైన గవయుడూ, గవాక్షుడూ సేనకు ముందుండి నడిచారు. ఎగరటంలో గొప్ప వాడైన ఋషభుడు సేనయొక్క కుడి పార్శ్వాన్ని రక్షించాడు; గంధమాదనుడు ఎడమ పార్శ్వాన్ని రక్షించాడు. సైన్యం మధ్యలో రాముడు హనుమంతుడి భుజాల మీద ఎక్కి కదిలాడు. అలాగే లక్ష్మణుడు అంగదుడి భుజాలమీద ఎక్కాడు. సైన్యం దక్షిణంగా బయలుదేరింది. వానరులు ఎగురుతూ, గెంతుతూ, సింహనాదాలు చేస్తూ, దారిలో కనిపించిన ఫలాలు కోసి తింటూ నడిచారు.

మహాసముద్రం లాగా కనిపించే ఆ వానరసేన కొండలూ, సరస్సులూ దాటుతూ, అరణ్యాలలో పళ్ళుతింటూ, తేనెలుతాగుతూ, కాలక్రమాన మహేంద్ర పర్వతాన్ని చేరింది.

రాముడు పర్వత శిఖరం మీద ఎక్కి సముద్రాన్ని చూశాడు. తరవాత అతను సుగ్రీవుడితోనూ, లక్ష్మణుడితోనూ కిందికి దిగివచ్చి, సముద్రతీరానికి చేరిన వానర సేనల వద్దకు వచ్చాడు. అతను సుగ్రీ వుడితో, "మనం ఇక్కడ మజిలీ చేసి, ఈ సముద్రాన్ని దాటే ఆలోచన చెయ్యాలి. ఇందుకు కాలం పడుతుంది. ఎవరినీ సేనను విడిచి పోనియ్యకు. శత్రుభయం



లేకుండా సేనకంతకూ గట్టి కాపలా ఏర్పాటు చెయ్యి." అన్నాడు.

వానరసేన మూడు భాగాలుగా చీలి సముద్రతీరాన విడిసింది.

అవతలి తీరం కానరాని ఆ మహా సముద్రాన్నీ, అందులో లేచే భయంకరమైన కెరటాలనూ, అందులో ఉండే భయంకరమైన ప్రాణులనూ తలచుకుని, వానరవీరులు, "దీన్ని ఎలా దాటటం?" అని తమలోతాము దిగులుపడ్డారు.

అక్కడ లంకలో హనుమంతుడి మూలంగా రావణుడికి తీరని పరాభవం జరిగింది. శత్రువులు ప్రవేశించరాని లంకలోకి ఒక కోతి సునాయాసంగా ప్రవేశించి, సీతను చూసింది; చైత్య ప్రాసాదాలు పగలగొట్టింది; అనేకమంది రాక్షసయోధులను చంపింది.

రావణుడు సభలో ఈ మాట చెప్పి, "ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? మనకు మేలు కలిగే ఉపాయం ఏమిటి?" అని అడిగాడు.

రాముడు పెద్ద వానరసేనతో లంక మీదికి వస్తున్నాడని లంకలో తెలిసింది. రాముడి సేనలు సముద్రాన్ని దాటుతాయన్నది కూడా రావణుడు నమ్మాడు. తనసేనకూ, వానరసేనకూ మధ్య యుద్ధం జరిగితే తన పట్టణానికీ, సేనకూ అపాయం కలగకుండా ఉండే మార్గం అతను తెలుసుకోగోరాడు.

ఆలోచన లేని రాక్షసులు, "రాజా మనకు అంతులేని సేన ఉన్నది. అద్భుతమైన ఆయుధాలు ఉన్నాయి. ఎందుకు విచారం?" అన్నారు. అతను లోగడ సాధించిన ఘనవిజయాలను గురించి మాట్లాడారు. శివుడి స్నేహంగల కుబేరుణ్ణే రావణుడు జయించాడు; పాతాళంలో మహాసర్పాలు అతనికి ఓడారు. అతనికి ఓడని రాజు లేడు. ఈ రాముడు ఏపాటి? వానరుల మాటకు వస్తే ఇంద్రజిత్తు ఒక్కడే వానరుల నందరినీ నాశనం చెయ్యగలడు.

ప్రహస్తుడు రావణుడితో, "రాజా, నీకు దేవ, దానవ, గంధర్వులూ, పిశాచాలూ ఎదురు నిలవలేవు; కోతులనగా ఎంత? మనం అజాగ్రత్తగా ఉన్న సమయంలో హనుమంతుడు వచ్చి ఇంత చెయ్యగలిగాడు గాని, లేకపోతే వాడు ప్రాణాలతో ఇక్కడినుంచి పోగలిగి ఉండేవాడా? నీ ఆజ్ఞ అయితే నేను వెళ్ళి భూప్రపంచంలో ఉన్న వానరుల నందరినీ చంపి, సృష్టిలో వానరుడనేవాడు లేకుండా చేస్తాను," అన్నాడు.

దుర్ముఖుడనే రాక్షసుడు కూడా తాను వెంటనే వెళ్ళి వానరుల నందరినీ చంపుతాననీ, హనుమంతుడు చేసిన పని రాక్షసులకూ, ప్రత్యేకించి రావణుడికీ ఎంతో అవమానమనీ అన్నాడు. వజ్రదంష్ట్రుడనే రాక్షసుడు కూడా తాను ఒక్కడే వెళ్ళి, వానరులతోబాటు రామ, లక్ష్మణ, సుగ్రీవులను కూడా చంపేస్తానన్నాడు. చంపటానికి వాడి చేతిలో పరిఘ ఒకటి సిద్ధంగానే ఉన్నది.

వాడు ఇంకో ఉపాయం కూడా చెప్పాడు. అదేమిటంటే, కామరూపులైన రాక్షసులు మనుష్య రూపాలు ధరించి, అనేక వేల సంఖ్యలో రాముడి వద్దకు వెళ్ళి, తమను భరతుడు పంపించాడనీ, తమ వెనకగా భరతుడు పంపిన సేన వస్తున్నదనీ చెప్పాలి. అప్పుడు లంకలో నుంచి రాక్షససేన వెళ్ళి, ఆకాశం నుంచి రాళ్ళూ, రప్పలూ కురిపించి, వానర సేనను చంపెయ్యాలి! తరవాత రామలక్ష్మణులు గుండెలు పగిలి చస్తారు!

"నేను ఒక్కణ్ణేపోయి రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమంతులను చంపేసి, చక్కావస్తాను," అన్నాడు నికుంభుడు. వాడు కుంభకర్ణుడి కొడుకు. వజ్రహనుడనేవాడు తాను వెళ్ళి వానరులనందరినీ తినేస్తానన్నాడు. ఆ మాట తలుచుకుంటేనే వాడికి నోరు ఊరింది.

మొత్తం మీద రాక్షస వీరులందరూ లేచి, రకరకాల ఆయుధాలు ఎత్తిపట్టుకుని యుద్ధానికి సిద్ధమయ్యారు.





# ఉలుకాగా ఉపాయం

పూర్వం ఆఫ్రికా అడవుల్లో నివసించే అటవిక తెగల్లోని ఒక తెగకు నాయకుడు ఉలుకాగా; మరొక తెగకు నాయకుడు ఒహాయో. ఈ రెండు తెగలకు మధ్య బద్ధ శత్రుత్వం వుండేది.

ఒహాయో తెగలో బలవంతులైన యువకులు చాలా మంది ఉన్నారు. అతని బలగం చాలా పెద్దది. ఎంత బలగం ఉన్నా ఏం లాభం? చాలా చిన్న అటవిక తెగకు నాయకుడైన ఉలుకాగాను కానీ, అతని అనుచరులను కానీ, ఒహాయో మట్టుపెట్టలేక పోతున్నాడు. అందుకు బలమైన కారణం ఉన్నది.

ఉలుకాగాకు ఒక అద్భుతమైన వైద్య రహస్యం తెలుసు. కొన్ని వనమూలికలతో ఉలుకాగా ఒక లేపనం తయారు చేస్తాడు. ఎలాంటి గాయమైనా సరే, ఆ లేపనం పూయగానే, క్షణాల్లో మాయమౌతుంది. విషపు బాణాలకు గురయి చావు బ్రతుకుల్లో ఉన్నవాళ్ళకు, ఆ లేపనం వాసన చూపించగానే ప్రాణం లేచి వస్తుంది. ఇలాంటి దివ్య ఔషధం వల్ల, ఉలుకాగా తెగ ఆటవికులు, శత్రువుల దాడిలో చచ్చిపడి కూడా, నిమిషాలలో బ్రతికి లేచి కూర్చునేవారు. అందుచేత, ఉలుకాగా గూడెంలోని వాళ్ళు తక్కువమందే అయినా చెక్కు చెదరకుండా ఉండేవాళ్ళు. కాని ఒహాయో తెగలోని వాళ్ళు ప్రతిసారీ పోరాటంలో, వందలాది మంది ప్రాణాలు కోల్పోయేవారు.

ఉలుకాగా, తన తరవాత తన తెగకు నాయకుడు కావలసిన ఒకే ఒక్క కొడుకు కిథెంజేకి, దివ్యౌషధం ఎలా తయారు చేయాలో నేర్పాడు. ఉలుకాగాకు, కిథెంజీకి తప్ప ఆ ఔషధం గురించిన

ఆఫ్రికా జానపద కథ



వివరాలు ఆ తెగలో మరెవ్వరికీ తెలియవు. ఈ సంగతి శత్రువుల తెగ నాయకుడు ఒహాయోకి తెలిసింది.

ఒకసారి ఒహాయో, తన ముఖ్యానుచరులతో సంప్రదించి ఒక ఉపాయం పన్నాడు. దాని ప్రకారం, అవకాశం చూసి గుట్టుచప్పుడు కాకుండా ఒహాయో అనుచరులు, ఉలుకాగానూ, కిథెంజీనీ అపహరించుకు వచ్చారు. వాళ్ళను చంపటం ఒహాయో ఉద్దేశం కాదు. నయాన్నో, భయాన్నో ఆ దివ్యౌషధ రహస్యం వాళ్ళ నుంచి రాబట్టాలన్నదే అతడి కోరిక.

ఒక కొండ శిఖరం మీద నిలువుపాటి శిలలకు ఉలుకాగానూ, కిథెంజీనీ కట్టివేశారు. వాళ్ళను ఒహాయో అనుచరులు రకరకాలుగా హింసించసాగారు. గండు చీమలతో కరిపించారు. అడవి తుమ్మ ముళ్ళతో అరికాళ్ళు అరిచేతులు గాయపరిచారు. అయినా, ఉలుకాగా కానీ, కిథెంజీ కానీ నోరు విప్పలేదు. ఆ ఔషధ రహస్యం చెప్పలేదు.

ఇంతలో ఒహాయో అనుచరుడు ఒకడు, రెండు నల్ల మండ్రగబ్బలను తీసుకు వచ్చాడు. అవి కాటువేస్తే చావు ఖాయం! వాటిని చూడగానే కిథెంజీ భయంతో వణికి పోసాగాడు. కొడుకును చూసి ఉలుకాగా ఆలోచనలో పడ్డాడు.

"ఏమంటావ్, వీటితో కరిపించి చంపమంటావా? లేక ఆ రహస్యం చెప్పి, ప్రాణాలు కాపాడుకుంటావా?" అని అడిగాడు ఉలుకాగాను ఒహాయో.

ఉలుకాగా, కొడుకు కేసి ఒకసారి చూసి, ఒహాయోతో, "ముందుగా నేను ఒక నియమం పాటించాలి. నేను నా జాతి కోసం మాత్రమే ఉపయోగపడాలని ప్రమాణం చేసిన ఆ వైద్యరహస్యం, నా జాతివాళ్ళు చూస్తుండగా, మరొక జాతి వాళ్ళకు చెప్పలేను. అందుచేత ముందు నా కొడుకును చంపేయండి. అప్పుడు, ఆ రహస్యం నేను మీకు చెప్పినా ఆ సంగతి నా జాతివాళ్ళెవరికీ తెలియదు. అలా

నేను నా జాతివాళ్ళ ముందు నా పరువు కాపాడుకుంటాను,'' అన్నాడు.

ఒహాయొా తల ఆడించాడు. అతని ఆజ్ఞానుసారం ఒక అనుచరుడు విషపు బాణంతో కిథెంజీని చంపాడు. విష ప్రభావంతో నల్లబడిన కొడుకు శరీరాన్ని చూసి, ఉలుకాగా ఇక శత్రువులకు భయపడి కిథెంజీ ఆ రహస్యాన్ని బయట పెట్టలేడు. ఇక ఆ భయం లేదు! అని తృప్తి పడ్డాడు.

''నీవన్నట్టు నీ కొడుకును చంపాం, ఇక ఆ ఔషధ రహస్యం చెప్పు,'' అన్నాడు ఒహాయొా, ఎంతో ఉత్సాహంగా ఉలుకాగా కట్లు విప్పుతూ.

''మీరు చంపింది నా కొడుకును కాదు. దివ్యౌషధ రహస్యం తెలిసే ఒకే ఒక అవకాశాన్ని,'' అన్నాడు గంభీరంగా ఉలుకాగా, ఒక బండ రాయి మీద కూర్చుంటూ.

''ఏమిటి నువ్వనేది?'' అన్నాడు ఒహాయొా అయోమయంగా.

''మీరు నల్ల మంత్రగబ్బలను తీసుకు రాగానే, వాటిని చూసి నా కొడుకు కిథెంజీ భయంతో వణికిపోయాడు. అంటే—ఆ రహస్యం మీకు చెప్పేస్తాడని అర్థం. ఈ సంగతి గ్రహించే, ఈ దివ్యరహస్యం మీకు తెలియకుండా ఉండేందుకు, నా కొడుకును చంపమని చెప్పాను. నా మాట నమ్మి, మీరు కిథెంజీని చంపారు. ఆ ఔషధ రహస్యం తెలిసే ఒకే ఒక్క అవకాశాన్నీ పోగొట్టుకున్నారు. ఇక నన్ను మీరేమీ చేయలేరు—చంపటం తప్ప. చావుకు భయపడి, శత్రువులకు దివ్యౌషధ రహస్యం చెప్పేందుకు, నేను పిరికివాణ్ణి కాను. ఆ రహస్యం చెప్పినా, ఎలాగూ మీరు నన్ను చంపుతారు, అప్పుడు మా తెగ మీద మీ తెగది పైచేయి అవుతుంది. అందుకు నేను అంగీకరించను. మాకు ఉపయోగపడని ఆ గొప్ప ఔషధం, శత్రువులయిన మీకూ అందగూడదు,'' అంటూ ఉలుకాగా, ఆ కొండ శిఖరం మీదినుంచి కింది లోయలోకి దూకేశాడు!





# ఆడకోతి

పూర్వం కాంచీపురరాజ్యాన్ని కనకసేనుడనే రాజు పాలిస్తూ వుండేవాడు. ఆయన చాలా విలాసపురుషుడు. దూరదేశాల నుంచి కూడా అనేకరకాల పూల మొక్కలూ వృక్షజాతులూ తెచ్చి, రాజభవనం వెనక చక్కని ఉద్యానవనం పెంచాడు.

అందమైన ఆ ఉద్యానవనంలో, మనోహరమైన కొలను తవ్వించాడు. కొలను చుట్టూ పెద్దపెద్ద చెట్లూ, వాటిని అల్లుకుని రకరకాల పుష్పలతలూ ఉన్నాయి.

ఒకనాడు కాంచీపురరాణి కొలనుకు స్నానానికని వెళ్ళింది. కొలనులో దిగుతూ తను ధరించిన నగలన్నీ దాసీదాని చేతికి ఇచ్చింది. వాటిలో ఒక అమూల్యమైన రత్నాలహారం కూడా వున్నది.

రాణి ఇచ్చిన నగలన్నిటినీ దాసీది కొలను ఒడ్డున పెట్టి, అక్కడ చేతికి అందిన చెట్లనుంచి పూలు కోయసాగింది. ఇంతలో అక్కడ చెట్లపైన వుండే ఒక ఆడకోతి హఠాత్తుగా కిందకు దూకి ఆ రత్నాలహారాన్ని అంది పుచ్చుకొని, ఒక్క గెంతులో మళ్ళీ చెట్టు ఎక్కేసింది.

హారాన్ని కోతి ఎత్తుకుపోవటం దాసీది చూసింది. కాని ఏం చేయటానికీ తోచక చూస్తూ వుండిపోయింది. ఇంతలో రాణి కొలనునుంచి బయటికి వచ్చి, దుస్తులు ధరించి, నగలలో తన రత్నాలహారం కనబడకపోయేసరికి దాసీదానిని అడిగింది.

"ఏమోనమ్మా, మీరు ఇచ్చిన నగలన్నీ ఇక్కడే పెట్టాను!" అన్నది దాసి, రాణి కోపగిస్తుందేమో నన్న భయంతో.

రాణి వెళ్ళి రాజుతో ఈ దొంగతనం సంగతి చెప్పింది. రాజు మంత్రిని పిలిపించి సూర్యాస్తమయం లోపల దొంగను

పట్టి తీసుకురావాలని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞ ప్రకారం మంత్రి వెంటనే దండనాయకుణ్ణి పిలిచి జరిగినదంతా వివరించి, సూర్యాస్తమయం లోపల రత్నాలహారంతో సహా దొంగను పట్టి ఒప్పగించకపోతే ఉద్యోగం దక్కదని గట్టిగా చెప్పాడు.

దండనాయకుడు యుద్ధానికి వెళుతున్నట్టుగా వందలకొలది సైనికులతో బయలుదేరాడు. పట్టణం అంతా గాలించి వేశాడు. దొంగ ఎవడో, ఎలా వుంటాడో ఎవరికీ తెలీదు. కాని, దొంగతనం చేసినవాడు తప్పక బీదవాడై వుంటాడనీ, బీదవాడైతే మాసిన దుస్తులతో, పెరిగిన గడ్డంతో వుంటాడనీ వారి నమ్మకం.

చివరికి పట్టణమూ, ఆ చుట్టుపట్ల వున్న అడవులూ వెదికి సూర్యాస్తమయం లోపల ఒక చింకిగుడ్డవాణ్ణి కోటకు లాక్కొని వచ్చారు. దొంగ దొరికాడని వినగానే రాజు తక్షణం దర్బారుకు వచ్చాడు.

"రత్నాలహారం ఎక్కడ దాచావు?" అని గద్దించి ప్రశ్నించారు రాజుగారు. దొంగిలించలేదంటే ఎవ్వరూ నమ్మరనీ, ఆ నిమిషానే ఉరితీయిస్తారనీ భయపడి, ఆ బీదవాడు, "రత్నాలహారం, కోశాధిపతి గారికి ఇచ్చానండీ!" అన్నాడు. అలా అన్న వెంటనే కోశాధిపతిని రెక్కలు



విరిచికట్టి రాజు ముందుకు లాక్కొని వచ్చారు. రాజు అదేప్రశ్న మళ్ళీ అడిగాడు. కోశాధిపతికి రాజు మనస్తత్వం తెలుసు; కనుక తడుముకోకుండా, "మన ఆస్థానజ్యోతిష్కులవారికి ఇచ్చానండీ!" అన్నాడు.

ఆస్థానజ్యోతిష్కుణ్ణి కాళ్ళూ, చేతులూ కట్టి తెచ్చి రాజుగారి ముందు నిలబెట్టారు. రాజు అంతకుముందు ఇద్దరినీ ప్రశ్నించినట్టే మళ్ళీ ప్రశ్నించాడు. దానికి జోతిష్కుడు తడబడకుండా, "మంత్రిగారి పెద్దకుమారుడికి ఇచ్చానండి!" అన్నాడు. ఇంతవరకు విచారణ జరిగేసరికి చాలా పొద్దుపోయింది.



అందుచేత, ''తతిమ్మా వ్యవహారం అంతా రేపు ఉదయం చూసుకుందాం. నేరస్థులను మాత్రం ఖైదులో వేయండి!'' అని చెప్పి రాజుగారు లేచిపోయారు.

ఆ రాత్రి మంత్రికి నిద్రపట్టలేదు. రత్నాలహారం పోవడం, ఆ దొంగతనం ఎవడో బీదవాడితో ప్రారంభమై చివరకు తన కొడుకు మీదికి రావడం—అంతా చిత్రంగా తోచింది. అర్ధరాత్రిసమయాన పడకగది నుంచి బయలుదేరి సరాసరి నేరస్థులు బంధింపబడిఉండే గది తలుపు దగ్గరకు వెళ్ళి చెవిఒగ్గి వినసాగాడు.

జైలు గదిలోపలనుంచి సన్నగా ఏడుపు వినబడింది. మంత్రి అలానే తలుపు దగ్గరగా చెవివుంచి వింటున్నాడు. ఇంతలో ఆ ఏడుపు ఆగిపోయింది. అదేసమయాన బీదవాడి గొంతుక ఇలా అన్నది:

''కోశాధిపతిగారూ! నన్ను క్షమించాలి. ప్రాణభయంవల్ల అలా మీ మీద అబద్ధం చెప్పేశాను. నిజానికి ఆ రత్నాలహారాన్ని గురించి నాకేమీ తెలియనే తెలియదు.''

తరవాత కోశాధిపతి, ''జ్యోతిష్కుల వారూ! నన్ను క్షమించాలి. ప్రాణభీతివల్ల మీ మీద చెప్పేశాను. జ్యోతిష్కులు గనక, నిజం తెలుసుకోగలరు కదా అని అలా అనేశాను,'' అన్నాడు.

ఇక జ్యోతిష్కుడు ప్రారంభించాడు: ''జ్యోతిషం, నా శ్రాద్ధమూను! ఇలాంటి దొంగతనాలు జ్యోతిషానికి అందేవికావు. అందుకే తెలివిగా మంత్రికొడుక్కి ఉచ్చు వేశాను.''

ఇంతవరకూ అందరి మాటలూ విన్న మంత్రికి రహస్యం తెలిసిపోయింది. సరాసరి అర్ధరాత్రివేళ రాజు దగ్గరకు పోయి, నిద్రలేపి, తను విన్నదంతా చెప్పేశాడు.

మంత్రి చెప్పినదంతా విని, రాజు ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. తన రాణికి ప్రాణప్రదమైనఆవెలలేనిరత్నాలహారాన్ని ఎవరు దొంగిలించినట్టు? తెల్లవార్లూ రాజుకు ఇదే ఆలోచన.

తెల్లవారింది. రాజు దాసీదానిని పిలిపించి, "నిజం చెప్తావా, లేకపోతే నిన్ను ముక్కలు ముక్కలుగా నరికించి, కాకులకూ గద్దలకూ వేయించమంటావా?" అని బెదిరించాడు.

దాసీది హడిలిపోయింది.

''మహారాజా! నేను నిర్దోషిని. కాని కొలనుపక్కని రావిచెట్టు మీద నివసించే ఆ ఆడకోతి మీద మాత్రం నాకు అనుమానమున్నది!'' అని చెప్పింది.

''ఆ ఆడకోతి మీద ఎందుకని నీకు అనుమానం! అది నీకన్నా అందంగా వుందనా?" అన్నాడు రాజు, కళ్ళెర్రచేస్తూ.

''లేదు ప్రభూ! అది అమ్మగారి లాగే వయ్యారంగా నడవాలని ప్రయత్నించడం చూశాను. అమ్మగారు కొలనులో స్నానం చేస్తున్నంతసేపూ, అది కూడా చెట్లకొమ్మల మీద స్నానం చేస్తున్నట్టు అభినయించేది. అమ్మగారి లాగానే కనపడీ కనపడనట్టు చిరునవ్వు నవ్వాలని కూడా ప్రయత్నించటం నేను చూశాను!'' అన్నది.

రాజుగారికి దాసీదాని మాటలు వినేసరికి అరికాలు మంట నెత్తికెక్కినట్టయింది. దాసీదానిని నిలువునా నరికేద్దామనుకున్నాడు. కాని రత్నాలహారం సంగతి గుర్తుకొచ్చి శాంతం వహించాడు.

''అయితే, రత్నాలహారం ఆ ఆడకోతే దొంగిలించిందంటావా? బాగానే వుంది. మరి ఆ హారాన్ని అదెక్కడ దాచిందో తెలుసుకోవడం ఎలా?'' అన్నాడు రాజు.



"అదేమంత కష్టంకాదు ప్రభూ!" అని అంటూ చిన్నగా నవ్వింది ఆ దాసీది.

"ఎందుకని కష్టం కాదు?" అని అడిగాడు రాజు ఉగ్రుడై.

"తమరు భవనంలో వున్నప్పుడేగదా రాణీగారు ఆ రత్నాలహారాన్ని ధరిస్తారు?" అని ఎదురు ప్రశ్న వేసింది దాసీది.

"కావొచ్చు!" అన్నాడు రాజు కనుబొమలు చిట్లిస్తూ.

"ప్రభూ! తమకు నామీద కోపం రావొచ్చు కనక, అంత వివరంగా చెప్పలేను. కాని, ఆ ఆడకోతి రత్నాలహారాన్ని ఎక్కడ దాచిందో కనుక్కోవాలంటే, మనం ఒక మగకోతిని తీసుకునివస్తే వెంటనే తెలిసిపోతుంది!" అన్నది దాసి.

దాసీదాని మాటలలోని అంతరార్థం గ్రహించి, రాజు చిరునవ్వు నవ్వుకున్నాడు. రాణీని ఆడకోతితోను, తనను మగకోతితోనూ అది పోల్చుతున్నదని గ్రహించాడు. కాని, ఎలా అయినా ముందు ఆ రత్నాల హారం రాబట్టుకోవాలిగదా!

రాజు ఆజ్ఞాపించగా, భటులు క్షణాల మీద ఒక మగకోతిని తెచ్చారు. రాజోచితంగా దానిని అలంకరించారు. ఆ మగకోతి వెనక రాజూ, మంత్రీ మొదలైనవారు అందరూ సపరివారంగా ఉద్యానవనంలోకి వెళ్ళారు.

రావిచెట్టు మీద నివసిస్తున్న ఆడకోతి ఇదంతా చూసింది. ఒక్కగెంతులో ఆ పక్కనవున్న చెట్టుతొర్రలో జొరబడి, అక్కడ దాచివుంచిన రత్నాలహారం బయటికి తీసి, మెడలో వేసుకున్నది. తరవాత చెట్టుదిగి, రాణీగారి లాగే వయ్యారంగా నడుస్తూ, మగకోతి వేపు బయలుదేరింది.

రాజభటులు ఆడకోతిని పట్టుకుని దాని మెడలోని రత్నాలహారం లాక్కున్నారు. అది కీచుకీచుమంటూ తిరిగి చెట్టు మీదకు పారిపోయింది.

రత్నాలహారం రాణికి ఇచ్చి, నిర్దోషులందర్నీ వదిలేశారు. అందరితోపాటు రాజు దాసీదాని తెలివిని మెచ్చుకున్నాడు.





# తగినవరుడు

విజయపురి ఆస్థానంలో రామశర్మ అనే గొప్ప జ్యోతిష్కుడుండేవాడు. ఆయన ఒకనాటి సూర్యోదయం వేళ, నదికి వెళ్ళి స్నానం చేసి వస్తూండగా, దారి పక్కన వున్న ఒక చెట్టు కొమ్మకు, ఉరి వేసుకోబోతున్న యువకు డొకడు కంటబడ్డాడు.

రామశర్మ, ఆ యువకుణ్ణి ఆపి, బాగా మందలిస్తూ, "నీ పేరేమిటి? ఏ ఊరు నీది?" అని అడిగాడు.

"నా పేరు జయసింహుడు. విజయపురి మా ఊరు," అని యువకుడు చెప్పాడు.

"పాతికేళ్ళయినా నిండినట్టులేవు. అప్పుడే జీవితం మీద నీకు విరక్తి కలిగిందా?" అని అడిగాడు రామశర్మ.

"మనసారా ప్రేమించిన అమ్మాయిని, పెళ్ళి చేసుకునే అదృష్టం లేనప్పుడు, బతికి ఏం ప్రయోజనం?" అని విచారంగా బదులు చెప్పాడు, జయసింహుడు.

"ఏదీ, నీ చెయ్యి ఇలా చూపించు!" అని రామశర్మ, అతడి హస్తాన్ని కొంచెం సేపు పరిశీలనగా చూసి, "అహాఁ, బ్రహ్మాండమైన వివాహయోగం వున్నది, నీకు! పెద్దల సమక్షంలోనే, నువ్వు ప్రేమించిన అమ్మాయితో, నీకు పెళ్ళి జరిగి తీరుతుంది, తెలుసా?" అన్నాడు.

"అంత ఖచ్చితంగా మీరెలా చెప్పగలరు?" అన్నాడు జయసింహుడు అనుమానంగా.

"నా పేరు రామశర్మ. విజయపురి ఆస్థాన జ్యోతిష్కుణ్ణి. పేరు వినే వుంటావు," అన్నాడు గర్వంగా రామశర్మ.

"ఏం జ్యోతిష్యమో మరి, నేను ప్రేమించింది బ్రాహ్మణ కన్యను. నేనేమో బ్రాహ్మణ్ణి కాను. ఆ అమ్మాయిని, తల్లిదండ్రులు నాకెలా ఇస్తారు చెప్పండి?" అని అడిగాడు జయసింహుడు.

బి. రఘురామరాజు

''జాతకంలో రాసిపెట్టి వుండాలి గాని, పెళ్ళికి కులం ఒక అటంకమా? వరుడి గుణగణాలు ముఖ్యం. గాని, కులంతో పనేమిటయ్యా? ఆ అమ్మాయి తండ్రి మీ పెళ్ళికి తప్పక ఒప్పుకుంటాడులే,'' అన్నాడు రామశర్మ అభయమిస్తున్నట్టు.

''ఆ అమ్మాయిది ధనిక కుటుంబం. మేము పేదలం. బీదవాళ్ళతో వియ్యమందడానికి, ఆ అమ్మాయి తండ్రి ఎలా సిద్ధపడతాడు?" అన్నాడు జయసింహుడు.

రామశర్మ చిరునవ్వు నవ్వి, ''నీకు కాబోయే మామగారు చాలా ధనికుడంటున్నావు. ఆయన ఆస్తిలో కొంత నీకిచ్చి, నిన్ను కూడా ధనికుణ్ణి చెయ్యవచ్చు కదా!'' అని సమాధానమిచ్చాడు.

''అదీ నిజమే ననుకోండి. కాని, ఆ అమ్మాయి నాన్నగారు రాజాస్థానంలో పెద్ద ఉద్యోగి. నేను బాగానే చదువుకున్నా, ఇంత వరకు ఉద్యోగం దొరకలేదు. నిరుద్యోగికి పిల్లనివ్వడానికి, ఆయనకు చిన్నతనంగా వుండదా,'' అన్నాడు జయసింహుడు.

''అదొక సమస్యా! కాబోయే మామగారే, తన పలుకుబడి ఉపయోగించి నీకు రాజాస్థానంలో ఉద్యోగం ఇప్పించి తీరుతాడు,'' అన్నాడు రామశర్మ.

''జీవితంపై ఆశ చచ్చిన నాకు, మీ సమాధానాలు జీవం పోశాయి. నేను ప్రేమించిన అమ్మాయితోనే, నాకు పెళ్ళవుతుందని నమ్మకం కుదిరింది!'' అంటూ రామశర్మకు సాష్టాంగ నమస్కారం చేశాడు జయసింహుడు.

''ఇంతకూ, నువ్వు ప్రేమించిన అమ్మాయి ఎవరు?'' అని అడిగాడు రామశర్మ.

''నేను ప్రేమించింది మరెవ్వరినో కాదు. మీ రెండో అమ్మాయి కావేరిని!'' అని చెప్పాడు జయసింహుడు.

''ఆరి పిడుగా! నన్నే బోల్తా కొట్టించావే,'' అంటూ రామశర్మ, జయసింహుడి భుజం తట్టి, తనను ఎంతో చాకచక్యంగా ఇరకాటంలో పెట్టి, సంబంధం కుదుర్చుకున్న జయసింహుడే తగినవరుడని అతడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేశాడు.



## హరిస్తున్న నయాగరా!

ఒక వైపు అమెరికా నుంచీ, మరొకవైపు కెనడా నుంచీ చూసే యాత్రికులకు ఆనందాశ్చర్యాలను కలిగిస్తున్న బ్రహ్మాండమైన నయాగరా జలపాతం క్రమేణా మామూలు ప్రవాహరూపం పొందగలదని భూగర్భశాస్త్ర వేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఉధృతంగా దూకే జలం, అడుగున వున్న సున్నపురాయిని హరించడం వల్ల—దాదాపు 10,000 సంవత్సరాలకు పూర్వం ఏర్పడిన ఈ జలపాతం మరొక 20,000 సంవత్సరాలలో మామూలు నదిలాగా ప్రవహించవచ్చని భూగర్భశాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.





## పెంగ్విన్ పక్షులు

అంటార్కిటికా అనగానే, బుల్లిబుల్లి అడుగులతో మంచుఖండ మంతటా అటూ ఇటూ పరుగులు తీసే పెంగ్విన్ పక్షులు గుర్తుకు వస్తాయి. ఈ పెంగ్విన్ పక్షులలో పదిహేడు రకాలున్నాయి. దక్షిణ ధ్రువంలో ఇలా కోకొల్లలుగా కనిపించే పెంగ్విన్లు ఉత్తర ఆర్కిటిక్‌లో మచ్చుకు కూడా కనిపించడం లేదు!

## తాగడం తప్ప, తినడం లేదు!

సాలెపురుగు ఆహారాన్ని పట్టి తింటుందా? తినదు. పట్టి తాగుతుంది! ఎందుకంటే గొట్టంలాంటి దాని నోరు ద్రవపదార్థాలను తాగడానికి మాత్రమే ఉపయోగపడుతుంది తప్ప, తినడానికి పనికిరాదు. సాలెపురుగు నోటి నుంచి స్రవించే ఒక రకం ద్రవం, కీటకాలను కరిగిస్తుంది. సాలెపురుగులు ఆ రసాన్ని మెల్లగా జుర్రుకుంటాయి. టారంటూలా (పులికోచ) అనే ఒక రకం పెద్ద సాలెపురుగు చిట్టెలుకనుగాని, చిన్న పిట్టనుగాని ఒక రోజులో కరిగించి ఆహారంగా జుర్రుకోగలదు!



# Cuddles always say "I love you."

Show your little ones how much you love them! And is there a better way of doing that than giving them a huggable, cuddlable playmate?

Cuddles. From the people who have given children the delightful entertainer of a magazine, Chandamama. Cuddles. A whole new range of stuffed toys. And, your old favourites. And, cute surprises being introduced regularly. Each one a sweet, adorable companion to your child. Absolutely safe. Designed to withstand childhandling.

Well, the fun and excitement of the festive season is just round the corner. Make it memorable for your child with a special gesture. With a Cuddle.

- CUDDLES — Stuffed toys from Chandamama.
- SAMMO — Mechanical and electronic toys from Chandamama

I♥U

## CUDDLES

Manufactured in technical collaboration with Sammo Corporation, South Korea

**CHANDAMAMA TOYTRONIX**

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026

*from*

**THE HOUSE OF**

**CHANDAMAMA**

Mudra:M:CTPL 4274

**CUDDLES AND SAMMO TOYS WILL BE AVAILABLE AT ALL LEADING TOY OUTLETS EXCEPT IN THE STATES OF ASSAM, HIMACHAL PRADESH, MADHYA PRADESH AND NORTH EASTERN STATES**

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: జత....

రెండవ ఫోటో: మరపించును వెత!

పంపినవారు: ఎస్. కృష్ణవేణి, ఎం. టి. ఎం. ప్రభుత్వ స్త్రీల కళాశాల
హిందుపూర్, అనంతపురం జిల్లా (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# అంతా  మా పిల్లలకే !


నాన్నా
చూడటు


ఆ కొంగలు
ఒక గేదెను తరుము
తున్నాయి.
అది వాటి
గూటిదగ్గరికి
వెళ్ళిందేమో.


చూడు...
ఒక గుడ్డులోంచి పిల్ల
బయటికొచ్చింది...


కానీ గేదె గడ్డి తింటుంది.
ఆ పక్షి పిల్లనేం చెయ్యదుగా
నాన్నా.
అది నిజమే దీపా.
కానీ పిల్లల
విషయానికొస్తే . . .
AMRITA BHARATI


తల్లి
దండ్రులుగా
మేమెంతో జాగ్రత్తగా
వుంటాము.


ఒక్క విషయంలో నేనా
కొంగ నాన్నకన్నా మెరుగు,
తెలుసా ...
అమ్మా!


నా దగ్గర జీవిత భీమా వుంది.
నాకేమైనా జరిగినా నా పరివారానికి
ఏ లోటూ వుండదు.

JUNIOR

# QUEST



# NOW with the added fun of SPUTNIK Junior!




Selections from Sputnik Junior!.

* *Colourfully illustrated* stories and cartoons.
* Superb science fiction
* Entertainment and general knowledge

64 packed pages!
At just Rs. 6/-




To subscribe write to,
JUNIOR QUEST,
Dolton Agencies,
Chandamama Buildings,
N.S.K. Salai, Vadapalani,
Madras: 600 026.



A Chandamama Vijaya Combines publication

